

## పుష్పాంజలి

భోగిగా, ఆదర్శలక్ష్యవాదిగా, దీనజనోద్ధారకుడై ప్రేమించి, ఆదరించి, నిర్విరామంగా మానవశ్రేయస్సుకు పురోభివృద్ధికి తోడ్పడి అమర పదవి నలంకరించిన పూజ్యబాబు కేసరిగారికి స్మృతివార్షిక వర్ధంతి సందర్భమున నా సవినయ భక్తి ప్రేమానురాగాలతో సమర్పించు పూజా పుష్పం

'గృహలక్ష్మి'





# మనుజునకు రక్తమే జీవనము

రక్తమే ప్రాణాధారము. ఈ రక్తము దేహమంతటను నాడుల మార్గమున పోయి శరీరపటుత్వమును కలిగించుచున్నది. రక్తము మనము భుజించు ఆహారము నుండి పుట్టుచున్నది. కొందరు తమ శరీరదార్ఢ్యమును కాపాడుకొను మార్గములను మఱచి వ్యాధుల పాలగుచున్నారు. [illegible] మనుజులను అనారోగ్యులుగ చేయుచున్నవి. మఱియు విశేష సంచారము, అకాల భోజనము, మితిమీరిన భోజనము, మనోవ్యాకులము, మొదలగు వాటిచేత మనుజునకు జఠరాగ్ని మందగించి ఆహారమందు యిచ్ఛలేక వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. ఈ కారణమువలన కొంతకాలమునకు శరీరమునందు నిరాటంకముగా ప్రవహించెడు రక్తమునకు ఆటంకము గలిగి అశక్తుడై, రక్తముచెడి అజీర్ణము ముఖ్యముగా సంభవించుచున్నది. ఈ అజీర్ణవ్యాధిని ఆధారపఱచుకొని గుల్మము, కడుపుబ్బరము, మలబద్ధము, భేదులు, వాంతి, అరుచి, పాండు, కామిల మొదలగు వ్యాధులు కలుగుచున్నవి — మందబుద్ధి, ధాతుక్షీణము కూడ కలుగుచున్నవి. అపరిశుద్ధ రక్తమువలన శోభ, లీట, మేహపొడ, తామర, మేహవ్రణములు మొదలగు చర్మవ్యాధులు కలుగుచున్నవి.

ధాతుక్షీణము, అశుద్ధరక్తము, రక్తమునకు ఆటంకము కలిగించి పక్షవాతము, సంధివాతము, మొదలగు వాతరోగములు సంభవించుచున్నవి. శ్వాసకోశములు, హృదయము, పిత్తకోశముచెడి, కాస క్షయాదులు, హృద్రోగము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగు వ్యాధులు సంభవించును.

సమస్తవ్యాధులకు మూల కారణమగు అపరిశుద్ధ రక్తమును శుద్ధపరచి మనుజుని ఆరోగ్యమును కాపాడుటకు మా 'అమృత' శ్రేష్ఠమయినదని వాడినవారు చెప్పుచున్నారు.

'అమృత' పైవ్యాధులను కుదుర్చుటయేగాక నిలకడగనుండు తలనొప్పి, కడుపులోనిమంట, [illegible] నివర్తింపజేయును.

'అమృత' లో [illegible] కనుక, [illegible] రసగంధక, [illegible] విషద్రవ్య దోషములవల్లను చెడినరక్తమును శుద్ధియగును.

'అమృత' వలన స్వప్నస్ఖలనము, శుక్లస్రావము, మందబుద్ధి, సుఖసంకటములు, కీళ్లనొప్పులు మొదలగు జబ్బులు కుదురుచున్నవి. మంచిబలము, రక్తవృద్ధి, ఆరోగ్యము, ఇంద్రియపుష్టి, వాక్చాతుర్యము, దీర్ఘాలోచనశక్తి కలుగుచున్నవి.

'అమృత' సారవంతములగు మూలికలతోను, రసవంతములగు ఫలములతోను మకరందపూరితములగు పుష్పజాతులతోను తయారుచేయబడిన ద్రావకము. ఇది బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యదశల యందు ఎల్లరు సేవించుటకు దగినట్లు తయారు చేయబడినది.

'అమృత' యను నామమునకు తగినట్లు రుచికరముగను యింపైన సువాసనతో నిండియుండునట్లుగను తయారు చేయబడినది.

12 ఔ|| బుడ్డి రు. 4–4–0

6 ఔ|| బుడ్డి రు. 2–4–0

## కేసరి కుటీరం లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14**

తెలుగుజిల్లాలకు, నైజామునకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్స్, బెజవాడ – సికిందరాబాదు




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఒకు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువులకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినప్పుడు మాత్రము రచయితలకు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసినచో బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




వ్యవస్థాపకులు

**డాక్టరు. కే. యన్. కేసరి**

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

**సంపుటము ౨౮]   జూన్ 1955   [సంచిక ౬**

# విషయ సూచిక





బాండుంగ్ లో జరిగిన ఆఫ్రికా, ఆసియా దేశాల మహాసభలో పాల్గొన్న భారత, పాకిస్తాన్ ప్రధానమంత్రులు పండిట్ జవహరులాల్ నెహ్రూ, మహమ్మదాలీగారలు డాక్టర్ సోకర్నో గారి ఆతిథ్యాన్ని స్వీకరించినప్పటి ఛాయాచిత్రము.




జయజయ గృహలక్ష్మి పత్రి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!

జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# విద్యా విధానం సంస్కరింపబడాలి!

ప్రస్తుతపు జాతీయావసరాలకు వినియోగపడని విద్యా విధానము సంస్కరింపబడాలని ప్రతియొక్కరు అభిప్రాయపడుతూనే యున్నారు. కాని ఆ సంస్కరణలను రూపొందించి అమలు పరచడానికి ప్రభుత్వము ఎందుకు ఉదాసీనత వహిస్తున్నదో అర్థముకాదు.

ప్రస్తుత విద్యా విధానము అనేక విధాల లోపభూయిష్టము. విద్యార్థులకు విద్యార్థి దశలో రక్షణకలిగించలేనిది; పోనీ విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాతనైనా నిలకడైన జీవనోపాధి ఏర్పడి రక్షణ పోషణ లేర్పడతావంటే – అదీ అనుమానాస్పదమే. ఇక ఉపాధ్యాయుల స్థితిగతులు చూద్దామా అంటే – ముఖ్యంగా ప్రాథమికోపాధ్యాయులు చాలి, చాలని జీతాలతో త్రికరణశుద్ధిగా తమ ధర్మాలను, బాధ్యతలను నిర్వహించలేక పోవడం, పొట్టాత్రంకొద్దీ అనేకయావలతో విద్యార్థుల అభివృద్ధి, అభ్యుదయాలను నిర్లక్ష్యం చేయడం జరుగుచున్నది.

ఇక విద్యాభ్యాసము నేది ఏ గుమాస్తాగిరి నుద్దేశించి మాత్రమే జరుగుచున్న దానిని జాతీయావసరాలమేరకు తీర్చిదిద్దాలి. జాతీయావసరాలంటే గుమాస్తాగిరి చేయడానికి అర్హత సంపాదించడము కాదనియు, అంతకంటె ముఖ్యమైన బాధ్యతలను స్త్రీలు, పురుషులు నిర్వహించడానికి తర, తమ అనే విచక్షణలేకుండా తగిన విద్యా యోగ్యతలను జాతీయ విద్యావిధానం రూపొందించు నట్టిదిగా రూపొందాలి.

నిర్బంధ ప్రాథమిక విద్యావిధానం దేశం మొత్తముమీద అమలు జరగాలి. సాధ్యమయినంత త్వరగా ప్రతియొక్కరు అక్షరాస్యులుకావాలి. అందుకుగాను ప్రాథమిక ఉపాధ్యాయులను ఉత్సాహపరచి వారివారి బాధ్యతలను లోటులేకుండా నిర్వహించడానికి వారి జీతాలను పెంచాలి. నిత్యావసరాలకు లోటులేకుండా నలుగురిలో గౌరవనీయమైన స్థానము నాక్రమించిన ఉపాధ్యాయ వర్గము జాతీయ విద్య, విజ్ఞాన పురోభివృద్ధికి విశేషంగా తోడ్పడగలదు. ప్రాథమిక విద్యాబోధనకు స్త్రీలు విశేషంగా వినియోగించబడటంవలన సత్ఫలితాలుమెండు.

ఉన్నత విద్యావసతులను విస్తృతం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనాకలదు. కాని ఉన్నత విద్యాభ్యాసాని కుపక్రమించే ముందు ప్రతియొక్కరు తన అభిరుచుల ననుసరించి తాను ఆర్జించబోవు విద్య తనభవిష్యత్ జీవనమునకు ఎలాగ నుపయోగపడనున్నది గుర్తించి తను ఆర్జించిన విద్య విజ్ఞానములను జాతీయావసరాలకు, తన జీవనోపాధికి వినియోగించుకోడానికి విద్యాభ్యాసము పూర్తికాగానే అవకాశాలు సిద్ధంగా నుండాలి.

విద్యార్థి ఆర్థిక యిబ్బందులకు గురికాకూడదు. విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత నిరుద్యోగిగా జీవనోపాధికొరకు అలమటించకూడదు. విద్య, విజ్ఞానాల వ్యాప్తికి ఉత్సాహంగా దీక్షాబద్ధులై ఉపాధ్యాయులు కృషిచేయకలుగాలి. ఈ సూచనల ననుసరించిన విద్యావిధానం జాతీయ మానసిక వికాసానికి, ఆరోగ్యభాగ్యాలకు తోడ్పడగలదు.



రేడియో బ్రాడ్ కాస్టు

# పిలవని పేరంటము

'విదూషక విద్వాన్' శ్రీ ముకుంది వేంకటశాస్త్రి



పేరంటము అనగానే పెండ్లి మొదలైన శుభ కార్యాలకు ఆడవాళ్ళు, పిల్లలు ముస్తాబై వెళ్ళి అచ్చట పెండ్లివారు వెళ్ళినవారికి పసుపు, కుంకుమలిచ్చి పారాణి పాదాలకుపెట్టి గంధాములిచ్చి సత్కరించడం మన దృష్టిపథానికి వస్తుంటుంది.

ఇక పిలవకనే పేరంటానికి వెళ్ళేవాళ్ళ అచ్చట ముచ్చటలనుగూర్చి నేనిప్పుడు మీతో ప్రస్తావించేద.

ఆహ్వానములేకుండా ఏదైనా ఉత్సవంలోగాని వివాహాది శుభకార్యాలకు స్త్రీలు, పురుషులు వెళ్ళి పాల్గొనటానికే సామాన్యంగా పిలవని పేరంటం అంటాం. ఇందులో పిలవకపోవడానికి ఎన్నో కారణాలుండవచ్చు.

పిలవకపోవడానికి ముఖ్యమైన కారణం మరచి పోవడమైనా అయివుండాలి - లేదా అందరినీపిలిచి తాము నిగ్రహించలేమనే జంకు అయినా వుండవచ్చు. లేదా పిలిచేవారికీ పిలవబడవలసినవారికీ మధ్య అపోహాలుండవచ్చు. అటులకాదేని అనవసరం అని మానవచ్చు. పిలుపు సకాలానికి అందకపోవచ్చు. అలాగే పిలవకుండా వెళ్ళడానికికూడా మందమరుపే కారణం. మా స్నేహితుడొకనియింట్లో బారసా లయింది. అతడు మనకంత స్నేహితుడుగదా-పిలిచే వుంటాడనుకొని ఆహ్వానము యింకా రాలేదేమో అనుకొని ఒక ప్రొఫెసరుగారు అక్కడ హాజరయ్యారు. అక్కడ యజమాని కొంచెము సంభ్రమముపడ్డా, అట్టి సంభ్రమముపడినజాడ కనపడనీయకుండా కప్పేసి, "వచ్చేవుటోయీ శాస్త్రీ! ఇంకా రాలేదేమని నీ కోసమే ఎదురుచూస్తూన్నాను. చూడండర్రా శాస్త్రికి కాఫీతెండీ" అని హంగామా చేశాడు. ఆ నాటికీ యీ నాటికీ ప్రొఫెసరుగారికి తాను పిలవని పేరంటంగా వెళ్ళానని స్ఫురించలేదు.

ఇంకో కారణం సామాన్యంగా గొప్ప వాళ్ళిళ్ళలో జరిగే కార్యక్రమాల్లో కనబడుతూంటుంది. ఆ పూరులో అప్పుడే పైకివస్తూవున్న పరపతికల న్యాయవాది అనుకోండి - అలాంటిచోటికి సుప్రసిద్ధులంతా వస్తూంటారు. అక్కడికి తను వెళ్లడం తన భవిష్య రాజకీయ జీవితానికి అవసరం. ఏదో వంకపెట్టుకుని తానా యజమానిదృష్టి నాకర్షిస్తే ఆయన పిలుస్తాడు. లేదా, "ఇన్విటేషన్ లిస్టు" రాసేవాళ్లని పట్టుకుని తన పేరు అందులో చేర్చుకోవచ్చు. ఈ పిలవని పేరంటంవల్ల మర్నాడు పత్రికలలో వివాహానికివచ్చిన పురప్రముఖుల పట్టికలో తన పేరుకూడా చేర్చుకోవచ్చు.

పిలవని పేరంటంగా వెళ్ళడం స్వార్థంకోసం అయివుంటుంది - ఆ సందర్భాలలో చేరే సమాజంలో తన ఎలక్షన్ ప్రచారమో, తన పుస్తకాల ప్రకటనో, తన ఆడపిల్లల పెళ్లి సంబంధాలో, మరోటో, మరోటో అపేక్షించి వెళ్లడం జరుగుతూంటుంది.

మరొకప్పుడు సన్నిహిత బంధువర్గంలో పిలవని పేరంటంగా వెళ్ళవలసిన పరిస్థితులు వస్తుంటాయి. అలాంటప్పుడు కొందరు యజమానులు "అయ్యో పాపం - మనం పిలవకపోయినా వచ్చారు" అని పిలిచినవారిని ఆదరించినట్లే ఆదరించడంకద్దు - కాని కొన్ని సందర్భాల్లో పట్టుదల లెక్కువగా వున్నప్పుడు పిలవని పేరంటంగా వచ్చినవారికి ఆవాహనా, విసర్జనా వుండదు.

పురాణ ప్రసిద్ధమైన పిలవని పేరంటాలు కొన్ని వున్నాయి. దక్షప్రజాపతి పరమశివుణ్ణి తన యజ్ఞాని కాహ్వానించలేదు. అల్లుడు కాబట్టి మామగారి పిలుపును గురించి పట్టుపట్టడని అనుకున్నాడు. కాని సతీదేవి పుట్టింటివారింట్లో వైభవాన్ని చూడ్డానికి ఉబలాటపడింది. పరమశివుడన్నాడూ - "ఓసీ వెర్రిదానా, పిలవని పేరంటానికి వెడితే అవమానం ఎక్కువ. అవమానం జరిగితే నువ్వెంతటి సాహసానికైనా ఒడిగట్టగలవు" అన్నాడు. పిలవని పేరంటంగా పుట్టింటికి సతీదేవి వెళ్ళింది. తల్లి, తోబుట్టువులు, తండ్రీ ఆమెను పలకరించలేదు. దక్షునికి యజ్ఞానికి ఆహూతులైన దేవతలుకూడా క్రిందిపెదవి మీదికెత్తలేదు. అభిమానంతో సతీదేవి పాదాన్ని నేలను రాచింది. యోగాగ్ని పుట్టింది. ఆ అగ్నిలో ఆమె భస్మమైపోయింది. వీరభద్రావతారము, దక్షాధ్వర ధ్వంసము జరిగాయి. వీరభద్రుడు సమర్థుడు; గనుక పిలువనిచోటుకి వెళ్ళి నిగ్రహించుకు రాగలిగాడు.

ఒక్కొక్కప్పుడు పిలవని పేరంటం అయినా ఆదరింపబడుతూంటుంది. ఇద్దరు తగాదా పడుతున్నారనుకోండి. పిలవని పేరంటంగా అందులో ప్రవేశించిన మధ్యవర్తినిగూర్చి తగాదాపడుతున్నవారిలో ఒకడు "నిన్నెవడడిగాడు తీర్పు?" అంటాడు. ప్రత్యర్థి అంటాడూ-తన తరఫున చెబుతున్నాడుగదా- అని "మధ్యవర్తి అయిన వాడెవడూ తనకి తోచిన మంచిముక్క చెప్పకుండా వుండలేడు. న్యాయం చెప్పడానికి బొట్టుపెట్టి పిలవక్కర్లేదు" అంటాడు.

భారతంలో వికర్ణుడు చూడండి. ముందుకొచ్చి తనకు తోచిన న్యాయం చెబుతాడు. అది దుర్యోధనునికి వ్యతిరేకంగా వుండడంచేత దుర్యోధనాదులంటారూ — "ఎల్లవారు ఎరుగనేరని ధర్మువు బేల! నీకు చెప్పనేల వలసె? చిఱుతవానికింత తఱు సంటి పలుకులు—జన్నె వృద్ధజనము లున్నచోట" అని గదమాయిస్తారు. అంటే "పిలవని పేరంటం అని నాకు తెలుసు—ధర్మం చెప్పడానికి ఒకరు పిలవక్కర్లేదు" అంటాడు వికర్ణుడు.

ఇటీవల క్షేత్రగతం పిలవని పేరంటాలు కొన్ని జరుగుతున్నాయి. ఎక్కడో ముఖ్యపట్టణాలన్ని ప్రక్కగింపునగాని పట్టణాల్లో అతిథులు తిరుగుతూ వుంటారు. గృహయజమాని 'అపరిచితు' 'కాని' వారికేమి. ఆ వచ్చిన అతిథి ఊరుకుంటాడా. "చూడండి. నేను పూర్వం కేశవశర్మగారి యింటికి వెళ్ళాలి. కాస్త దారి చూపించగలరూ" అంటాడు. అంటే పక్కగదిలో చదువుకుంటున్న అబ్బాయిని పిలిచి "వీరికి కేశవశర్మగారి యిల్లు చూపించిరా నాయనా" అని అనవలసి వస్తుంది—గృహస్థు. అంతటితో కుదరదు. కేశవశర్మగారి తరువాత నారాయణరావుగారింటికి, మాధవశాస్త్రిగారింటికికూడా వెళ్ళాలి.

పుణ్యక్షేత్రాల్లో కాపురముండే గృహస్థుల యింటికి పిలవని పేరంటాలు చాలా ఎక్కువ. మారుమూలల్లోవున్నా "వేంకట శాస్త్రిల్లుగారి యిల్లు ఎక్కడ?" అంటూ వస్తారు. "ఎవ్వ వెంగడ శాస్త్రిల్లూ" అని అడిగితే "అయ్యవండి...ఇంటి పేరు ఏదో కుండీ అని అంటూ వుంటారు ... మంచి పేరే ఆయనిది రాజమండ్రి" అంటారు. "ఏందయ్యా! శాస్త్రిలూ. ఎవరో నీకోసం కూస్తూండారు. చూడు" అని ఎదరవున్న కిల్లీకొట్టు నాయుడు పిలుస్తాడు. వీధిలోకివచ్చి చూస్తుంగదా—ఆ మనిషిని గుర్తుపట్టడమే కష్టం. ఆ ఆసామి అతి ఆప్యాయంగా "అదేమిటి శాస్త్రుల్లూ, ఆలా చూస్తారేం? వీరభద్రపురంలో మీ మీ పినతల్లిగారి యింటి పక్కని కాపురం వున్నవాళ్లు మా తమ్ముడు అత్తారు. మరచిపోయారూ?" అంటూ జట్కావాడితో సామానంతా లోపల పెట్టమంటాడు. ఊళ్ళో యిన్ని సత్రాలు, ఇన్ని ధర్మచావళ్లు వుండగా నాబోటిగాడి ఒకటిన్నర గదుల అద్దెకొంపలో తల దాచుకోడానికి యీ పిలవని పేరంటం ఏమిటా ... అనిపిస్తుంది. అది మొదలు చంద్రగిరి తీసికెళ్లమని తిరుచానూరు తీసికెళ్ళమని ఆ యజమానిని వేధిస్తూంటారు. ఇది క్షేత్రవాసులకు నిత్యసంఘటన.

పాపం సంభావన బ్రాహ్మలు మొదలైనవారు పిలవాలని పట్టింపు పెట్టుకోరు. ఆలాంటి

పట్టింపు పెట్టుకుంటే వాళ్ళకు సాగదు. పిలవని పేరంటంగా వెళ్ళాల్సిన విధి వాళ్ళకుంటుంది. వెళ్ళి ఏమీ ఎఱుగనట్లు లేకుండా అక్కడ యజమానిని యింకా, పెళ్ళికొడుకు గారిని తెలిసికొని వారిని పొగడు తూండడం వారికి అనుకూలమైన విశేషాలు కల్పించి కొని చెప్పడం ఉబ్బుబ్బో తబ్బిబ్బుగా ప్రవర్తించడం జరుగుతూంటుంది. అమ్మా! చూడండీ! — ఓ చెంబు యిస్తున్నారూ అంటూ ఒక గ్లాసో ఒక తప్పేలాయో ఓ పప్పుగిన్నో పుచ్చుకొని చదివిచ్చుకొని ప్రెజెంట్లు యివతలికి యిచ్చింది తెలిసినట్లు యిచ్చిన సంగతి చాటుతుంటారు. ఒకపూట భోజనం కోసం గడపని యీ పేదబ్రాహ్మణులు యింత వినయం యింత కొంపులు తినకు పడ్డపాట్లు చేసికొనేందుకు ప్రయత్నిస్తూంటారు. అక్కడికీ ఆ బ్రాహ్మణులు పిలవని పేరంటానికి వచ్చినవాళ్లు అని అందరూ ఎరిగే వుంటారు. అవన్నీ వాళ్లు చాల నెమ్మదిగా పడుతూనే ఉంటారు.

దేవుడి పెళ్ళికి అంతా పెద్దలే. వచ్చేవారందరూ పిలవని పేరంటానికి వచ్చినవాళ్ళే. దీన్ని బట్టి ఒక సామాన్య లక్షణం గోచరిస్తూంటుంది. దేవునివల్ల మనకు లాభం వుంటుంది. — కాబట్టి ఎవరూ మనల్ని పిలవకపోయినా వెడుతాము. గొప్పవారింటికి పిలవకపోయినా వెడతారు. పేదవారింటికి పిలిచినా వెళ్లరు. గొప్పవారి యిండ్లలో పెండ్లిండ్లలో "N B. Dont Bring Presents" అని ఆహ్వాన పత్రికలో హెచ్చరిక చేసినా చాటునా మాటునా కాన్కలనందజేస్తూనే ఉంటారు. బీదవారింటి పెండ్లిండ్లలో వాళ్లవల్ల మళ్లీ రావనే భావంతో చదివించం.

పిలవడానికని కొంత పరిమిత సంఖ్యకల లిస్టుపెట్టుకొని వారినిమాత్రమే పిలుస్తూండడం ఉంది. ఏ కారణంచేతనో అప్పటికీ ముఖ్యులనే మరుస్తూంటాము. అటువంటి ముఖ్యులనే పిలవడం ఎందుకు మరిచామో తెలియదు. అలాంటప్పుడు పెళ్లి అయిపోయిన తర్వాత వెళినప్పుడు అక్కడకు వెళ్లినవాడో మరొకడో ఒక శుభలేఖ వ్రాసి పోస్టుచేయడం కద్దు.

పిలవని పేరంటాలు ప్రతి విషయంలోను కలగచేసికొనడం కొందరికిష్టం. అలాటివాళ్ళ చేత సమస్యలైతే కొంతకాలపోతే కొంత సహించవచ్చు. కాని ఘోరంగా పరిణమించేది అయితే చాలా కష్టము గాక ప్రమాద బూయిష్టంకూడా. ఈ రకం మనుష్యులకి ఎక్కడ ఎక్కడ ఏమి జరుగుతున్నా తెలుసుకోవాలి. ఎవరెవరికి ఏ విధమైన వ్యాపారం సాగిందీ తెలియదు. వారికి యెవరికి ఏ రీతిగా చెబితే నచ్చుతుందో — ఆ విధంగా చెప్పడంలో వారిది అందెవేసిన చెయ్యి. పురాణాల దగ్గరవారు, భజనలదగ్గర వారు, పెండ్లిండ్లలో వారు, పెత్తనాల వారు, నీలాటిరేవున వారు, నీలాపనిందలను ప్రచారం చేస్తూ మనిషికీ మనిషికీ పొత్తు కుదరనీయకుండా అత్తా కోడళ్ల మధ్య, మామ అల్లుళ్ళ మధ్య, భార్యా భర్తలమధ్య, వదినె మరదళ్ళ మధ్య, వియ్యపురాళ్ళ మధ్య పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేటట్టు చేసె మళ్ళీ యేమీ యెరగనట్టూ అక్కడ చేరి అయ్యో! అంటూ అంగలార్చుతారు ఇలాంటి పిలవని పేరంటాలు అందరికీ సాధారణంగా అనుభవంలోనివే. ఈ అనుభవాలన్నిటిని బట్టే ఎక్కడకైనా పిలవనిదే వెళ్ళే సందర్భాలన్నిటిని గుది గుచ్చగా "పిలవని పేరంటాలు" అనే జాతీయం బయలుదేరింది.

(మద్రాసుఆలిండియా రేడియో వారి సౌజన్యంతో)

---

## వివాహమహోత్సవం

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టరు డాక్టరు డి. గోపాలాచార్లుగారి సోదరి సౌ. లలితకు, శ్రీ టి. కె. రాధాకృష్ణకు యీ నెల 10వ తేదీన వైభవంగా వివాహంజరిగింది. అశేష బంధుమిత్రులు, పురప్రముఖులు వధూవరుల నభినందించి ఆశీర్వదించారు. సాయంకాలము శ్రీమతి యం. యల్. వసంతకుమారి గాన కచ్చేరి జరిగింది.

# తీరని కోరిక

శ్రీమతి జి. కమలమ్మ



ఆ రోజు యిల్లంతా సందడిగా యున్నది. రాధ బడినుండి రావటంతోటే చిట్టి తమ్ముడు, చెల్లాయి తన దగ్గరకు పరుగెత్తు కుంటూ వచ్చారు. "అక్కయ్యా పెద్దక్క వస్తుందట నాన్నా స్టేషనుకు వెళ్ళారు" అంటూ తమ్ముడు ఏదేదో చెప్పుకొని పోతున్నాడు. రాధ పుస్తకాలు పెట్టేసి అమ్మదగ్గరకు వెళ్ళింది. "అమ్మా పెద్దక్కా వాండ్లు వస్తారా?" అని ఆశగా అడిగింది. చేసిన టిఫెన్ రాధకు పెడ్తూ అవునన్నది అమ్మ.

రాధ వుత్సాహముతో గబ గబా వెళ్ళి ముఖం కడుక్కొని, బొట్టు పెట్టు కొని, దువ్వెన తీసికొని జడవేయమని అమ్మదగ్గర కొచ్చింది. అమ్మ జడవేస్తుంటే రాధ రిబ్బను సరిచేస్తూ "ఈసారి అక్కయ్య నన్ను వూరికి తీసుకొని వెళ్తుందికదూ!" అని అమాయకంగా ప్రశ్నించింది. వెంకా యమ్మకు ఏమిచెప్పడానికి తోచక "చూస్తాంకానీ" అని సర్దేసింది.

రాధకు అక్క, బావ వస్తారంటే చటుక్కున ఒకటి జ్ఞాపకానికి వచ్చింది. పోయిన సంవత్సరము అక్కవచ్చినప్పుడు అమ్మతో అన్నది. "రాధను నాతో కూడ వూరికి తీసుకొనిపోతానని" రాధకు యిప్పుడు జ్ఞాపకానికి వచ్చింది ఆ సంగతి.

ఆ రోజు రాత్రి భోజనాలయిన తర్వాత అందరు డాబామీద చేరారు. నాన్న చదువుకోమని తొందర చేసారు. అయితే తనకు మాత్రం ఆ రోజు చదువుకోవలెనని లేదు. అక్కచెప్పేకబుర్లు వినాలనిపించింది. ఏలాగయితేనేం? నాన్న తొందర వల్ల పుస్తకాలు తీసుకొని, అందరి ముందూకూర్చున్నది. తిన్నగా యింగ్లీషు పుస్తకముతీసి ఆ రోజు టీచరు చెప్పిన పాఠము చదువుతూంది. తనకేమీ బోధ పడలేదు. మనసంతా అమ్మ అక్క సంభాషణవేపు మళ్లింది. అక్క "అమ్మా రాధను నాతో కూడ తీసుకొనిపోతాను. అది అక్కడే చదువుకొంటుంది. ఈ పల్లెటూరులో ఏంచదువుతుందని" చెప్పింది. దానికి సమాధానం వెంకాయమ్మ "ఈ సంవత్సర యిక్కడనే చదువుకొని, వచ్చే సంవత్సరం నీతోకూడ వస్తుందిలే. అది వస్తే చెల్లాయికి తమ్ముడికి ఏమితోచదు" అని రాధను విడిచివుండలేక సర్ది చెప్పింది. అక్క చేసేదేమీ లేక సరి అన్నది. రాధకు మాత్రం ఆ సమయంలో అమ్మమీద

కోపంవచ్చింది. "అమ్మ ఎప్పుడింతే, ఎక్కడికిపోనివ్వదు. సరదాగా పోతానంటే అమ్మకు ఒప్పదు" అని విసుక్కుంది తనలోనే. ఆ రోజు అట్లనే చాలాసేపు ఆలోచించి నిద్రపోయింది

మరల ఈ సంవత్సరం అక్క వస్తుందంటే తన సంతోషానికి మేర లేకపోయింది. రాధకు అక్కతోకూడ పట్నంవెళ్లి అక్కడి వింతలు, క్రొత్త ప్రదేశములు చూడాలనిపించింది.

వీధి గుమ్మంలోనికివెళ్ళి చూచింది. యింకా బండిరాలేదు. తమ్ముడు చెల్లాయితో వీధి అరుగుమీద కూర్చొని ఆడుకొంటూంది. కాసేపయిన తర్వాత వున్నట్లుండి తమ్ముడు అరిచాడు, "అక్కా బండి వస్తుందని" అందరు లేచి నిలబడ్డారు. గుమ్మం ముందర జట్కావచ్చి ఆగింది. అందులోనించి నాన్న, అక్క, బావ దిగారు. రాధ కండ్లు సంతోషముతో చెమ్మగిల్లాయి. వాండ్లతోకూడ ముగ్గురు యింట్లోకి వెళ్లారు. ఆ రోజు కబుర్లతో సంతోషముగా గడచిపోయింది.

ప్రతిసారి అక్క వచ్చినప్పుడు ఆమె వూరికి వెళ్తానంటే, యింకా రెండు రోజులు వుండిపోతే బాగుండుననిపించేది. ఈ సారి రాధను తనతోకూడ తీసుకొని పోతానన్నది కాబట్టి అక్కకూడ తొందరగావెళ్తే బాగుండుననిపించింది రాధకు. నాన్న అంటూన్నాడు బావతో "పది రోజులు వుండిపొమ్మని" ఈ సారి "తొందరగావెళ్ళిపోవలె మామయ్యా! శెలవు లేదని" అంటున్నాడు బావ. ఈ సమాధానం సంతోషమయింది రాధకు.

అక్క ప్రయాణం దగ్గరపడింది. రేపే అక్క, బావ వూరికిపోవలెనని అన్నీ సర్దుకొంటూన్నారు. ఈ మాటు అక్క, బావ తను రాత్రి అందరుపడుకొని నిద్రపోతున్నారు. కాని తనకుమాత్రం నిద్రపట్టలేదు.

తాను రైలుఎక్కి ఎన్ని సంవత్సరములు అయింది! తనకు మూడేళ్లప్పుడు బాబాయి కొడుకు పెండ్లికి తీసుకొని వెళ్లినట్లు అమ్మ ఎవరితోనో చెప్తూంటే విన్నది, అదే రాధ రైలు ఎక్కడం అంతే.

ఇప్పుడు అక్కతోకూడ వెళ్ళేటప్పుడు రైలు పెట్టెలో కిటికీతట్టు కూర్చుంటే పచ్చనిపైరులు, చెరువులు, యినుకబయల్లు, రాతిగుట్టలు చూస్తుండవచ్చును.

హాయిగా రెండురోజులు ప్రయాణం. ఈ మాదిరి రాధ వూహా ప్రపంచములో వుండగా ఎప్పుడో కునుకు పట్టింది.

తెల్లవారింది రైలుకు అంతా రెడీగా వున్నారు. రాధకు తాను అడుగుదామని

పించింది. అయితే అడగడానికి సిగ్గు పడింది. జట్కావాకిట్లో నిలిచింది. పెట్టె బెడ్డింగు తీసుకొచ్చి కూలివాడు బండిలో పెట్టాడు. బావ అందరితో వస్తానంటూ బండి ఎక్కాడు. అక్క కూడ వస్తానంటూ అమ్మదగ్గరకొచ్చి "అమ్మా ఈ సారి రాధను తీసుకొనిపోవ డానికి వసతిలేదు. ఈ మారు వచ్చి నప్పుడు తీసుకొని వెళ్తా"నంది. రాధ దగ్గరకువచ్చి ఒక రూపాయ చేతిలో పెట్టూ "బాగా చదువుతూండు రాధా!" అని చెప్పి బండిలో ఎక్కింది. రాధ దిగాలుపడిన ముఖముతో జట్కాపోయినవైపే చూస్తూ నిలబడిపోయింది. తన కోరిక నెరవేర నందులకు ఆ రోజు అంతా తన కేమీ తోచలేదు.

---

# అనసూయ

శ్రీ కన్నకంటి వీరభద్రాచార్యులు

ఓ యఖండ కళా స్వరూపిణి
ఓ యమేయ దయా సుధారస
దాయినీ! నీ వెవర వమ్మా
ధర్మ దేవతవు -

మాయ నంటని బాలదత్తా
త్రేయు లమ్మా! యనుచుఁ బిల్వఁగ
హాయిఁ జెందుచు నుంటి నీవన
సూయవా! జనని!

గోవులును పులు లొక్క రేవునఁ
గ్రోలు చున్నవి సలిల ధారల
పావనీ! నీ మధుర మధుర త
పః ప్రభావమున —

నిక్క తిరిగెడి దేవకాంతల
చక్క దిద్దుట కొరకు నారదుఁ
డుక్కు సెనగల నీయ గుగ్గి
ళ్లుడకఁ జేసితి వా!

పాల పాపలఁ జేసికొని ఆ
బ్రహ్మ విష్ణ్వీశ్వరులనే ఊ
యాల నూపుచు తీయతీయని
జోల బాడితివా!

కల్లలను కపటల నెఱుఁగని
తల్లి వనికొని ముగురు మూర్తులు
పిల్లలై నీ హృదయ సీమల
పెరుగఁ దలఁచిరిగా!

గాలుఁగదలఁగ నీక - సప్తా
శ్వాల రథమును నిలుపు దీక్షా
శీల - సుమతీదేవి నీ ప్రియ
శిష్యురాలుగదా!

భారత స్త్రీ సహజ శీల, మ
పారమవ్యయ మచలమని, బం
గారు తల్లీ! చాటితివి జో
హారులను గొనుమ!

---

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ

## మానవుని వ్యక్తి స్వరూపము

(గతసంచిక తరువాయి)

మరి ఈ ప్రాణముయొక్క వివిధ కార్యములనుబట్టి పంచప్రాణములు అని అయిదు పేర్లతో వేదాంతమున వ్యవహరింపబడుచున్నది.

మనోమయకోశము.-మనలో ఒక మనసు యున్నది అని తెలియనివారులేరు. మనసు అను స్థలములోనే, మన సంశయములు, ఆనందములు, కోరికలు మొదలైనవి నివసించును. ఇవి అన్నియు చేరి, ఆలోచనలు అను నిరంతర ప్రవాహమును కలిగించుచుండును. మనసు సంశయాత్మకము; బుద్ధి నిర్ణయాత్మకము. మనము వినిన, చూచిన స్థలములకెల్ల ఈ మనసు పరుగెత్తగలిగియున్నది. ఇట్టి సూక్ష్మశక్తివల్ల దీనిని పైకోశములకన్న సూక్ష్మమని తెలుపబడుచున్నది.

విజ్ఞానమయకోశము - వేదాంతభాషలో తరచుగా మనసును బుద్ధిని అభేదయికవిషయమని తెలుపుటకద్దు. మనసు ఒక నిశ్చయాత్మక స్థితికివచ్చి తీర్మానము చేయుగలిగిన, బుద్ధి అని తెలుచబడును. బుద్ధి పూర్వము విని చూడని స్థలములనుకూడ ప్రవేశింపగలదు కనుక మనసుకన్న బుద్ధి సూక్ష్మమని తెలుపబడుచున్నది. ఇదివరకు అనుభవింపని రంగములలో అది విహరించ గలిగియున్నది. కనుక బుద్ధి లేక జ్ఞానము మనోమయ కోశమునకన్న సూక్ష్మమని తెలుపబడుచున్నది.

ఆనందమయకోశము - ఇది మనము సుషుప్తి అవస్థలో అనగా గాఢ నిద్రలో అనుభవించు అజ్ఞాన ఆవరణము లేక గుణాభావ దశ. దీనిని ఆనందమని తెలుపుటవలన మానవుడు జాగ్రతావస్థలోను,స్వప్నావస్థలోను ఎట్టిదశ పొందియుండినను, సుషుప్తి అను గాఢనిద్ర పొందగనే నిర్మల శాంతమును, లేక ఆనందమును అనుభవించుచున్నాడు. భాగ్యవంతులుగాని, బీదలుగాని, జయము పొందిన, అపజయము పొందిన, ఆరోగ్యముతోనో, రోగముతోనో వృద్ధులో యౌవనులో అందరు ఒకే స్వరూప ఆనందమును సుషుప్తి యందు అనుభవించుచున్నారు. సామాన్య బుద్ధితో గమనించువారు ఇది జ్ఞానరహిత అవస్థ లేక శూన్య అవస్థ అని తలచుచున్నారు. అనగా ఈ అవస్థలో నుండువారు విషయ జ్ఞానము లేకున్నారు అని వారి అభిప్రాయము. ఇట్టి గాఢ నిద్రావస్థలో తను కలిగిన అనుభవములు ఏవినిలేక, అవి మరల అతనిని బాధ పెట్టని స్థితి అను ఆనందమును అనుభవింపుచున్నాడు. ఎటులైనను సరే, అతడు అనుభవించు ఆనందము అతడు స్పష్టముగా తెలుసుకొనుచున్నాడు.

వీటి అన్నిటి కన్నను సూక్ష్మమైనది మన జీవ అంశము. ఈ అయిదు కోశములకు సూత్రధారము అది. ఇదివరకు విశదీకరించిన పంచకోశములు, ఈ శాస్త్రీయ జీవ అంశము అన్నికలిసి నాకు, మీకుకూడ దివ్యస్థూల శరీర స్వరూపము ఏర్పరచుచున్నది. మనోకోశము, విజ్ఞానకోశము నిర్మలముగాను, పరిశుద్ధము గను యుండునట్టిన అట్టి జీవియందు ప్రజ్ఞ మిక్కిలి ప్రకాశవంతముగ నుండును. రాతియందు మనము లేదు; బుద్ధియు లేదు. కనుక వాటిలో ప్రజ్ఞ ఏమాత్ర మును లేదు. ఈ రాతి జీవమునకన్న వృక్షజాతిలో కొంత మనసు, విజ్ఞానము అంశమాత్రములో యున్న దని వేదాంతము తెలుపుచున్నది. కనుక వాటిలో ప్రజ్ఞ లేశము కనుగొనుచున్నాము. జంతువులయందు

మనసు, బుద్ధి మరింత వృద్ధిగాంచియున్నది. కనుక వాటి ప్రజ్ఞ విశేషముగా కనబడుచున్నది. అన్నిటి కన్న ఉత్కృష్ట అభివృద్ధిగాంచినది మానవుడు.

మనసును, బుద్ధియు నిర్మలముగా నుండుచోట ప్రజ్ఞ తీవ్రముగ ప్రకాశించుచుండును. మహాఋషులు, పరమసాధువులు పైగంబురులయందు ప్రజ్ఞ పరిపూర్ణ ప్రకాశముగాంచి యుండును. "బ్రహ్మవిత్ బ్రహ్మ ఏవ భవతి." అని శ్రుతులు తెలుపుచున్నవి. అనగా బ్రహ్మను ఎరిగిన మహనీయుడు బ్రహ్మయే అగుచున్నాడు. ఇట్టి శుద్ధ ప్రజ్ఞను, అనగా ఆత్మను, జీవ అంశమును, కనుగొనుటయే జీవిత గమ్యస్థానము. జన్మరాశి నిర్మూలములేక మానవాతీత కార్య నిర్వాహకము.

వాస్తవముగా మనము జీవ అంశములే అయి యున్నను, యన నిజస్వరూపమును సత్యరీతిని తెలుసుకొనని దోషమువల్ల, ఈ బాహ్య శరీరత్రయములలో దేనితోనో యొక దానితో ఐక్యము కల్పించుకొని, మన వివిధవ్యష్టి స్వరూపములు మనవని నమ్ముచున్నాము. ఇట్లు ఒక సమయమున "నేను నల్లగ యున్నాను"అని, "నేను బ్రాహ్మణుడను" "నేను పొట్టిగ యున్నాను" అని దేహముతో కలుసుకొనుచున్నాము. ఒకసారి "నాకు సంశయము కలుగుచున్నది" "నాకు భ్రమకలుగుచున్నది" "నాకు చీకాకుగా యున్నది" అని మనసుతో సంబందము కలిగించుకొనుచున్నాము. మరి యొకసారి, "నేను చాల బుద్ధిమంతుడనని, నేమందగిలి యున్నాను." "నాకు ఒక విషయము తెలియుచున్నది" అని, బుద్ధితో ఐక్యము పొందుచున్నాము.

ఇట్లు గమనించిన మనలో ఏదో యొక గుంపు మనుష్యులున్నట్లు తోచుచున్నది. ఇట్లు మనము ఈ బాహ్య విషయ కోశములతో తాదాత్మ్యము కల్పించుకొని, పిచ్చివారమై, పరిమితి, దుఃఖము ఆందోళనములపాలై అల్లాడుచున్నాము. ఇట్టి భారమువల్ల ఈ సంసారము మన స్వకల్పితము. ఈ పరిమితులకు లోనై, దుఃఖములనుభవించుటంతయు మన బాధ్యతలుగా నున్నవి.

ఇట్లు మనము పైన తెలుపబడిన పిచ్చికిని, భ్రమకు లోనైన వ్యక్తులుగ అనుభవించి జీవించుచున్నను, మన అంతరకోశముల తృప్తికొరకు మన బాహ్య కోశములను త్యజించ సిద్ధముగా యుండుట ప్రకటితమగుచున్నది. ఉదాహరణమునకు, ఒకనికి చేతియందు బహు బాధ కలిగించు వ్రణము ఏర్పడినదని అనుకొందము. వైద్యుడు పరీక్షించి, ఆ చేతిని ఛేదించి తీరవలెనని సలహా ఇచ్చును. అతడు తన మనసుకు కలుగుబాధ తొలగించుకొనుటకై, ఈ స్థూల శరీర ఛేదనమునకు యొప్పుకొనుచున్నాడు.

మరియొక చోట, ఒకనికి మత సంబంధమైనదో లేక, రాజకీయ సంబంధమైన విషయము న్యాయ సమ్మతమని బుద్ధికితోచిన యెడల, అట్టి సంస్కార కర్త, తన స్థూల శరీరమునకుగాని, మానసిక శరీరమునకుగాని, ఎట్టి బాధలైన అనుభవింప సమ్మతించి, తనబుద్ధి నిశ్చితమును కాపాడుకొనును. అనగా అతడు అంతరకోశములతో ఐక్యము పొందిన, దాని సంతోషమునకై బాహ్యకోశముల ఆశలు, సౌకర్యములను నిర్లక్ష్యము చేయుటకు సిద్ధముగానున్నాడు.

ఇట్టి తర్కమును చక్కగ అనుసరించగలిగియుండిన, (పైగంబరులు,) మహాపురుషులు, మన నిజస్వరూపము ఆత్మయని తెలుసుకొనిన వెనుక, వారి కోశములన్నిటిని చిత్రవధకు లోబడుటకు, ఒప్పుకొని వాటిని నిర్లక్ష్యభావముతో చూడగలిగిన తీర్మానము చక్కగ బోధపడగలదు. ఏసుక్రీస్తును శిక్షకు పాలుచేసి, కొయ్యల క్రాసుమీద నిలబెట్టి హింసించినను, మనస్ఫూర్తిగా, పూర్తి విశ్వాసముతో, కనికరముతో త్యాగభావముతో, "ఓ భగవానుడా! ఈ అజ్ఞానులను క్షమించుము. వారు చేయుకార్యములు వారు తెలుసుకొనలేకున్నారు." అని వేడుకొనెను. మన కాలములో ఒకమహాత్ముడు తుపాకి గుండ్లతో కాల్చబడికూడ, రామ రామయను తారకమంత్రమును జపించుచు దేహమును త్యజించగలిగెను.

## ఈశావాస్యోపనిషదు

మనము చరిత్రలో చదివియున్నాము. అలగ్జాండరు హిందూదేశమున విజయభేరీ మ్రోగించుచు దాడిచేయు నప్పుడు ఒక మహాత్ముని ఉత్తర హిందూస్థానమున చూడగలిగెను. అతడు ఆ చక్రవర్తిని నిర్లక్ష్యం చేయగా, చెరశాలలో బంధింపబడెను. మరునాటి దినము అలగ్జాండరు అతడు బంధింపబడియుండు చెరసాలకు వెళ్లి తన ప్రభావము తెలుపుకొనుచు, ఒక వరము కోరుకొనిన యిచ్చెదను అని అతనితో చెప్పెను. ఆ మహాత్ముడు చక్రవర్తి ముఖము వీక్షించి, సత్య జ్ఞానమువల్ల కలిగిన నిర్లక్ష్య భావముతో, పూర్ణజ్ఞానికి యుండగల శాంత భావముతో "నీవు సూర్యునికిరణములను అడ్డగించుచున్నావు. కొంత ప్రక్కకు (వై)తొలగుము. నేను కోరు వరమంతయు ఇంతే" అని నుడివెనట. తన స్వస్వరూపమును పునర్దర్శము పొందుటవల్ల భ్రమలన్నియు తొలగుట అపరిపూర్ణతలు తొలగుటయే గాక, తక్షణమే మానవాతీత, దైవపదవిని పొందగల ఊర్ధ్వగమనముగానున్నది.

ఉపనిషదు కర్తలగు ఋషులు పొందగోరిన హిందూమతము ఎటువంటిది అనగా వారిలో ప్రతి యొక్కరును మానవాతీతులై యుండవలెను. నిర్ణీత పరిస్థితులకు అధికారులుగ నుండవలెను, తన చుట్టును, తనలోను కలుగుచుండు వ్యవహారములను జయించిన వారుగనుండవలెను. ఇట్టి నిర్మాణమును మనలో ప్రతి యొక్కరు అనుసరించగలట్లు తెలుపునదే ఉపనిషదులు. జ్ఞానయజ్ఞమనగా, మనలోనుండు అసత్యము, క్రూరత్వము, తీవ్ర విలువలన్నిటిని, ప్రజ్వలించు జ్ఞానాగ్నిలో ఆహుతి చేయుట. మనము ఈ విషయపూరిత లోకములతో ఐక్యమును కలిగించుకొని, వాటి గుండా జీవిత దృష్టిని గమనించుచు అనేక నీచ విలువలకు లోనై ఆందోళనపడుచున్నాము. ఇట్టి మన బాహ్యలోకములతో ఐక్యము పొందిన తీర్మానమును ఎట్లు విరమించుకొనగలమో, మన స్వస్వరూపమును ఎట్లు పునర్దర్శనము పొందగలమో రేపు తీర్మానించుటకు సమ్మతించెదము.

ఇన్ని వివరణములు తెలుసుకొన అగత్యమేమున్నదని మీరు ఆశ్చర్యపడవచ్చును. "నాకు ఉపదేశించినట్లు నేను నడుచుకొనిన చాలదా" అని ఒక సోదర సాధకుడు ప్రశ్నించెను. మిత్రులారా! భక్తి అనునది, సాధకునకు ఒకగొప్ప బలవత్తరమైన ఉపకరణమే. కాని మూఢభక్తి భయమువల్ల ఉత్పన్నమయి, అజ్ఞానమున వృద్ధిగాంచుచున్నా, అది గొప్ప బంధమేయగుచున్నది. సాధనకు జ్ఞానమువల్ల పదునుకలిగి, మార్గసూచకమగుచున్నది. మనయాత్రలో సుఖప్రయాణముసాగించి, చక్కని గురికలిగి, తీవ్రవేగముతో గమ్యస్థానము చేరగలుగుదము.

ఓం శాంతిః శాంతిః శాంతిః

సశేషము



# చేయకలిగిన ఉపకారం

శ్రీ వి. వి. పున్నయ్య

ప్రతి ఏటా వేసవి కాలపు శెలవుల్లో మా స్వగ్రామానికి వెళ్లేవాడిని. అది కుగ్రామం కాదు; బస్తీయని అనడానికి అవకాశం లేదు. ఊరి చుట్టూ వరిపొలాలు, మామిడి జీడిమామిడితోటలున్నవి. సముద్రతీరం. చల్లనిగాలి, చక్కని మంచినీళ్ల వసతి; ఆరోగ్య నిలయంగా నుంటుంది. నాచిన్న ప్పటినుండి చూస్తున్నాను - యిన్ని వసతు లుండికూడ ఇండ్ల సంఖ్య పెరుగడంలేదక్కడ; ఊరు పెద్దదయి పురోభివృద్ధి గాంచడంలేదు.

నా చిన్నతనంలో సయితం బీద, బిక్కి యున్నా కూటికి కరువై అలమటించారని నేనెరుగను. 'జోలెకట్టుకొని నాలుగు బజారులు తిరిగినా సులభంగా మా నెడు బియ్యం దొరికేవి. గ్రామంలోని అధిక సంఖ్యాకులు చేనేత పారిశ్రామికులు. ఒళ్లు వంచి చాకిరి చేసేవారు. వచ్చే ఆదాయంతో తమ అవసరములు గడుపుకొని తృణమో, ఫణమో మిగుల్చుకోకలిగేవారు. రైతుల్లో పెద్ద భూస్వాములు, సన్నకారువారు కూడ దానధర్మాలు, పరమార్థచింతకలిగి యుండేవారు. వ్యాపారస్తులైనా న్యాయాన్ని, ధర్మాన్ని అనుసరించి యుంటుండేవారు. అప్పట్లో పరస్పరసద్భావం, విశ్వాసం యుంటూ ప్రజలు సన్మైత్రీగా నుంటుండేవారు.

నాకు మా జన్మస్థలాన్ని గురించిన అభిప్రాయం ఆనాడు, యీనాడు ఒకటే - నాలుగు యకరాల పొలముండి, ఒక కొంప, రెండు పశువులుంటే ఏకలకత్తా, మద్రాసు నగరాలలో వేలకువేలు సంపాదిస్తూగడిపే జీవితంకంటె వెయ్యిరెట్లు ఆనందంగా, సౌభాగ్యవంతంగా గడుపవచ్చునని. అయితే యీనాడు ఆగ్రామానికి బీదకళ పడడానికి కారణము ఏమిటని అడుగుతారని నాకు తెలుసు. కొద్దోగొప్పో ఆస్థి యున్నవాళ్లు ఉన్నది కరుకొక్కని తింటూ సోమరులు కావడం, వేలులక్షలున్న వాళ్లు స్వార్థంతో అంతులేని పేరాశలతో తోడి సామాన్య ప్రజానీకాన్ని దోచిపారేసి వారి కుటుంబాలను నేల మట్టానికి తేవడం, ప్రజలలో పరస్పర సద్భావము, సహకారము, పరమార్థచింత నశించడము యిందుకు కారణాలు.

ఇప్పుడు సయితం ఆ గ్రామానికి వెళ్లితే పోయిన ప్రాణాలను తట్టిలేపే సముద్రపు గాలి, ఎన్ని పదునులు వాన కురిసినా అరగంట తరువాత కాలికి తడిగాని తెల్లని యిసుక, టెంకాయ నీళ్లను మరపించే

మంచి నీళ్లు, నాకాగ్రామంమీద విశేష భక్తి, గౌరవ, అభిమానాలను రేకెత్తిస్తుంటవి. కాని యీనాటిస్థితి చూడ్డానికంటే — చేనేత పారిశ్రామికులకు వృత్తిలేదు; వ్యాపారము మందగించడంతో అనేక వర్తకుల కుటుంబాలు చితికిపోయినవి. ఏ పదిమంది భూస్వాములో తప్ప మిగిలిన రైతు కుటుంబాలు చచ్చీ చావక యీగిసలాడుతున్నారు. కూలినాలి చేసికొని జీవించే వారికి న్యాయమైన జీవనంలేదు — ప్రతివాడలో యిండ్లు జీర్ణావస్థలోనున్నవి. ఏ ఒక్కరి మొగాన కళాకాంతులులేవు. చాలయిండ్లు తాళాలు వేయబడియున్నవి — పాపం జీవనోపాధి కొరకు ఏకానని దేశాలకు తరలివెళ్లారో! వయోవృద్ధులంతా చాలమంది చనిపోయారు. యీ నాటి ప్రజల్లో ఒకకట్టుబాటు, నీతి, నియమాలు, చిన్న పెద్ద, మట్టు మర్యాదలు బాగా నీరసించినవి. మహాలక్ష్మమ్మ చెట్టుకు సమీపంలోనుండే ఒక వేపచెట్టుక్రింద ఎడతెరపి లేకుండ పని సాగే కమ్మరి కొలిమిలేదు. షుమారు పదిమంది వడ్రంగులు తీరికలేకుండా పని చేస్తుండే ఆ యీళ్లో. ఒకరో యిద్దరో ఉన్నట్లు, లేనట్లు జీవయాత్ర సాగిస్తున్నారు.

నేను చదువుకుంటున్నప్పటినుండి నేనా యీరికి వెళ్లగానే పట్నమాసపు కబుర్ల కొరకు ఎంతో మంది గుమికూడేవారు. నేను వెళ్లినచోటల్లా కనీసం అరగంటైనా నన్ను నిలవేసేవారు. నాకు సయితం ప్రొద్దుపోక గ్రామంమొత్తం తిరుగుతుండే వాడిని. నా చిన్నతనంనుండి రోడ్డు వెంబడి చెట్టు నీడన రాముణ్ణి చూస్తున్నాను. దాని సమీపంలోనే ఆతని పూరిల్లుండేది. నేను వెళ్లి ఆగ్రామంలోనున్నంత కాలం ఏదో పుస్తకమో, పేపరో తీసికొని మధ్యాహ్నం వేళప్పుడు రాముడుండే చెట్టునీడకు చేరేవాడిని. నాతోబాటు ఎండకు విశ్రాంతి తీసికుంటూ కొందరు అక్కడ కూర్చుండేవారు. అతని ప్రక్కన ఒక పదేళ్ల పిల్ల యుండి ఆడుకుంటుంటే రాముడు చెప్పులు కుట్టేవాడు. ఊళ్ళోనివాళ్లంతా నా చిన్నప్పుడు అతని చేతనే చెప్పులు కుట్టించుకునేవారు. నేనున్నంత సేపు ఏవేవో మాట్లాడేవాడు. దినదినానికి క్రమంగా తన వృత్తి గ్రామంలోని పరిస్థితులతో బాటు ఎలాగనీగసిస్తున్నది హృదయ విదారకంగా చెప్పేవాడు. నేను సయితం సానుభూతితో పట్నమాసపు విశేషాలను, వింతలను చెప్తూ అతనిని ఉత్సాహపరచాలని చూచేవాడను.

నాచదువయిపోయింది. ఉద్యోగంలో చేరడానికి ముందు మూడు నెలలు మాగ్రామంలో ఉండి ఒక రోజున యథాప్రకారం రాముడితో కాలక్షేపానికి వెళ్లాను.

''ఏం బాబయ్యా! భోంచేశారా''

అన్నాడు.

"ఆ . అంటూ" "రాముడూ! దేనికి వెంకి మారాం పెడుతున్నది" అన్నాను.

"ఏందో లే బాబయ్యా-నాగారబ్బాయి కొలువులకు పోవాలని అర్ధరూపాయి కావాలంటున్నది; యింట్లో పోయిబోడికి, పోయి క్రిందికి లేక రెండు రోజులనుండి నాలుగు యిండ్లలో నాలుగు కవళాలు తెచ్చుకొని ఆకలిబాధ తీర్చుకుంటున్నాము. దీనికి నేను ఎక్కడినుండి అర్ధరూపాయి తెచ్చి యివ్వగలను? — పిల్లలకు చెప్పినా పెద్దవాళ్ల సాధక బాధకాలు అర్థంకావు"

అర్ధరూపాయి జేబులోనుండి తీసి "వెంకీ! ఏడవకు - యిదిగో తీసికొని వెళ్లు" అని యిచ్చిపంపాను.

"బాబయ్యా! మునుపటిరోజుల్లో పది మంది పెద్ద ఆసాములయిండ్లకు చెప్పులు కుట్టిస్తే సంవత్సరానికి పదిసలకల తిండి గింజలు దొరికేవి. వాటితో బాటు చిల్లర చిల్లరగా చాకిరిచేస్తే వచ్చే ఆదాయంతో చీకుచింత లేకుండా జీవయాత్ర సాగించేవారం. అప్పట్లో పెద్దవాళ్లు ధర్మ ప్రభువులు; దయ, దాక్షిణ్యాలు కలవారు. రెడ్లల్లో వెంకటరెడ్డి, కాపుల్లో హనుమంతం తలపాగాలతో, వెండి మొలత్రాళ్ళు, చేతులకు బంగారు మురుగులు, చెవులకు ఎర్రరాళ్ళ అంటు జోళ్లతో బజారునపోతుంటేనే రాజసంగానుండేది. నాబోటివాడు ఎదురుగా నిలబడితే వారంరోజులకు కూటికి కరువు లేకుండా దొరికేది వారిదగ్గర. అట్టివారు లేరు యీ రోజుల్లో - నాబోటివారు చాకిరి చేస్తామన్నా యీ కుర్రకారుకు అది అవసరం లేదు. పదులు, యిరవైలు యిచ్చి కాంతం దీపాల కాంతుల్లో ఎందుకు కొరగాని చెప్పుల జతలను కొంటారుకాని, అంతకంటె మంచివి, అందమైనవి, హాయిని గూర్చేవి నేను కుట్టియుంచినా వారు కన్నెత్తిచూడరు. ఇక మా వృత్తికి యిక ఆస్కారమేమున్నది? ఇలాగే చెప్పులు కుట్టి యుంచి మీబోటి ఏ అయ్య అయినా కొంటాడేమోనని ఎదురుచూస్తూ, ఏదో వచ్చినఆదాయంతో తినీతినక కాలంగడుపుతున్నాం"

కుట్టి పెట్టియున్న ఏడెనిమిది జతలు ప్రక్కనే యుండి నా వైపు చూస్తున్నవా అనిపించింది. ఒకటొకటిగా చేతికి తీసికొని చూడసాగాను.

"బాబయ్యా! - చూడండి - యిది నూలుకుట్టుకాదు. వారు కుట్టు. ఇందులో ఏజతైనాసరే ఎంత మొరటుగావాడినా కనీసం ఒక సంవత్సరము పబ్బం గడుస్తుంది- మరి పట్నంలో మీరు చెప్పులు కొంటుంటారుకదా - జత ఎంతకాలముంటుంది" అన్నాడు.

నిజానికి చెప్పుల జతలు బాగున్నవి. వస్తువు నాణ్యత తెలియకుండా ఆడంబ

రానికి ప్రాకులాడే యీ నాటివారు ఖోలె డంతడబ్బు తగలేయడమేకాక దేశానికి జీవకర్రయైన గృహపరిశ్రమలను వెన్నున పొడుస్తున్నారనుకున్నాను.

"రాముడూ! నాకు సరిపోయే ఒక జతయియ్యి" అన్నాను నా కప్పట్లో అంతగా అవసరము లేకపోయినా.

వాడు ఒక దాని తరువాత ఒకటి తొడిగిచూచి అది సరిగ్గా నున్నదాన్ని ఒకటి తుడుస్తూ "బాబయ్యా! మా దానిలాంటి పరిశ్రమలను ప్రజలు అభిమానిస్తేగాని ఉత్పత్తులు నాణ్యంగా తయారుకావు; పరిశ్రమలు వృద్ధిగాంచవు" అనిచెప్పి నాకాళ్లకు తగిలించాడు.

"ఎంత యియ్యమంటావు"

"మీ దయ"

అయిదురూపాయల కాగితము తీసి యిచ్చాను. రాముడి కండ్లలో తృప్తి, సంతోషము, కృతజ్ఞత తొణికిసలాడినవి.

♦ ♦ ♦

ఉద్యోగంలో చేరిన తరువాత మూడు సంవత్సరాలు మా యూరికే వెళ్ల లేదు. సంక్రాంతి పండుగకుముందు అవకాశం కల్పించుకొని వెళ్లాను.

ఎప్పటివాడుక ప్రకారం రోడ్డుప్రక్కనున్న వేపచెట్టునీడకు వెళ్లాను కాని రాముడు లేడు. ఏమయినాడా అనుకుంటూ చుట్టూ చూస్తుండేసరికి సమీపంలోని గుడిశలోనుండి వెంకి బయటికివచ్చి నన్ను చూచి నా వైపుకు పరుగెత్తింది.

"వెంకీ! మీ అయ్య ఏడీ" అన్నాను.

"గుడిశలో ఉన్నాడు బాబయ్యా! పిలవనా" అంటూ పారిపోయింది.

రాముడు కర్ర పోటేసుకుంటూ గుడిశ వెలుపలికి వచ్చాడు. ఉక్కుమనిషిలాంటి వాడు బాగా డసిలాడు. నన్నుచూచి "బాబయ్యా! మీకుకూడ యీ యూరి మీద, మా మీద అభిమానం నశించి నట్లున్నదే" అంటూ చెట్టునీడకువచ్చాడు.

"ఏమిటి రాముడూ! యిలాగ నీరసించిపోయావు."

"అవును నీరసించాను - గ్రామంతో పాటు నీరసించక తప్పలేదు. ఈవూళ్లో తిండేది బాబయ్యా! మా బోటివారికి! ఎన్నియిండ్లవాళ్లు నలుముఖాల పొట్టచేత బట్టుకొని వెళ్లారు. మీరు చూచి యుంటారు-మన యూళ్లో రాత్రింబగళ్ళు పనిచేస్తుండే పది వడ్రంగి కుటుంబాలు, వేపచెట్టుక్రింది కమ్మరికొలిమి యీ నాడు యున్నవా? యిక చేనేత పారిశ్రామికులు జీవనం గడువడానికి పనరాని యిక్కట్లు పడుతున్నారు. చాలమంది దేశాంతరాలకు పోతున్నారు. ఇక నా సమ

కాలికుల్లో నేను, బత్తుడు బ్రహ్మయ్య తప్ప యింకెవరున్నారు యీ యూళ్లో."

"ఏమిటి రాముడూ అలాగంటావు!"

"పొడుగు చొక్కాలు తొడుక్కొని ఉపన్యాసాలిస్తే మాకు వృత్తులుంటవా బాబయ్యా! మా వృత్తులను భారీ యంత్ర పరిశ్రమల పోటీనుండి రక్షించాలి. మేము తయారుచేసే వస్తువులను కొనే లాగ ప్రభుత్వము ప్రజలను ప్రోత్సహించాలి; ప్రజలు అభిమానించి ఆదరించాలి మా పరిశ్రమలను. కుటీరపరిశ్రమల వుత్పత్తుల అమ్మకానికి దేశంలోను, విదేశాలలోను సాధ్యమైనన్ని వసతుల కొరకు ప్రభుత్వము, అన్వేషించాలి. అప్పుడు ఉత్పత్తుల నాణ్యత పెరగడం, దేశం బాగుపడటం ఉంటుంది" అన్నాడు గుక్క త్రిప్పుకోలేకుండా. పెద్దదగ్గు వచ్చింది. రాముడు ఉక్కిరి బిక్కిరైనాడు. వెంకి ఒకచెయ్యి, నేనొకచెయ్యి పట్టుకొని అతనిని గుడిశలోకి చేర్చాము.

నేనా యూళ్లో నున్నన్ని రోజులు అయిదు, పదియిస్తూ రోజూ వెళ్లి పది నిముషాలైనా రాముడితో మాట్లాడి రానిదే మనసు నిలిచేదికాదు. ఒక రోజున మధ్యాహ్నం రాముడు చాల నీరసంగా కనుపించాడు. నేను వెళ్ళగానే మంచములో పండుకొనే నా రెండు చేతులను పట్టుకొని "బాబయ్యా! నా జీవితం ఒకటి రెండు రోజుల గడువులోకి వచ్చింది. వెంకికి పెండ్లియీడు వచ్చింది; మాకు నా అనేదిక్కు మరెవ్వరులేరు. మరి నా తర్వాత ..." అన్నాడు బొల బొల కండ్లనీరు కారుస్తూ.

"పరవాలేదులే రాముడూ! - నీవు ఆయాసపడకు - వెంకి మా ఆడపిల్లల్లో ఒకతెగా నుంటుందిలే" అన్నాను సానుభూతితో. నా కండ్లు సయితం చెమ్మగిలినవి.

"కృతజ్ఞుడను బాబయ్యా! - నీ ఋణం నేనెలా తీర్చుకోనున్నానో చెప్పలేను. నాకున్న ఒక చింత తీరిపోయింది. నిశ్చింతగా నా జీవయాత్ర ముగించవచ్చునేనిక- వెంకీ! యింతకాలం మీ అమ్మ చనిపోయినప్పటినుండి నాతోపాటు కష్టమో, సుఖమో అనుభవించావు. ఇక నేను దాటిపోతున్నాను. ఇక బాబయ్యే నీకు తండ్రైనా, తల్లైనా. బాబయ్య కనుసన్నలలో మెలగమ్మా! యింతకంటె నేను ఒప్పజెప్పవలసిన ఆస్థిపాస్తులు నీకు తెలియనివేమిలేవు" అన్నాడు రాముడు.

వెంకి భోరున వెక్కి వెక్కి ఏడ్వసాగింది. నేనాదృశ్యం చూడలేక మెల్లగా యింటిముఖం పట్టాను. తర్వాత మూడు రోజులకు రాముడి జీవాత్మ పరమాత్మలో చేరిపోయింది.

నేను మద్రాసుకు వెళ్లేటప్పుడు వెంకిని వెంటబెట్టుకొని వెళ్లాను. చదువు చెప్పించి మెల్లగా నర్సుగా తర్ఫీదు చేయించాను. ఒక ప్రైవేటు హాస్పిటలులో నౌకరి సమకూరింది. ఒక హైస్కూలులో ఉపాధ్యాయుడుగా నుంటున్న యువకునకు వెంకికి వివాహమయింది. పరలోకవాసి రాముడి ఆత్మకు యింతకంటె శాంతిని సమకూర్చకలిగేది మరేమి యుంటుంది ?

నేను రాముడి కుటుంబానికి చేసిన సహాయాన్ని చూచి అయినవాళ్లు, కాని వాళ్లుకూడ అనేక రకాలుగా విమర్శించారు. కాని ఆత్మసమ్మతంగా పారమార్థిక చింతతో నేను చేసిన సహాయం యితరుల దూషణ భూషణాలకు మాత్రం కాదు.

---

హైద్రాబాదు నగరంలో పొట్టతిప్పలకు ఆడవాళ్లుకూడా సైకిల్ రిక్షాలు తొక్కుతున్నారని తెలిసింది. ఏప్రెల్ నెలలో యిద్దరు రాత్రిళ్లు రెండో సినిమానుంచి ఆడవాళ్లను యింటికి తీసుకువెళుతున్న రిక్షావాలీలు కనిపించారు. అంతకు రెండు నెలల క్రితం ఒక రాత్రి మగవేషంతో సైకిల్ తొక్కుతున్న ఒక స్త్రీని పోలీసులు అరెస్టు చేశారు.

—సుబ్బారావు

# ప్రబోధం

'సుధ'

అది పెండ్లిరోజు. ఇల్లంతా కిటకిటలాడుతూ వచ్చే పోయే బంధు జనుల గౌరవ మర్యాదలతో సరిపో తోంది. పార్వతి ఏదో అవ్యక్త ఆనందానుభూతిని పొందుతోంది. కాని ఏమో తెలియని భయభీతులు మాత్రం మనస్సులో దట్టంగా కమ్ముకున్నాయి. వచ్చేపోయే బంధు మిత్రులంతా పెండ్లికూతుర్ని చూచి పలుకరించి ఏదో ఆప్యాయంగా మాట్లాడి వెళ్లిపోతున్నారు. కన్యదాతలకేగాక వచ్చిన బంధు జనులకు కూడ ముఖ్యమైన వ్యక్తి పెండ్లి కూతురు. ఈ హడావిడి అంతా ఆమె నిమిత్తమైవచ్చినదేగా!

పార్వతి చిన్న కుగ్రామంలో పెరిగింది. తండ్రి పెద్ద మోతుబరు. కరణీకం, వ్యవసాయం చేసు కొంటున్న సంపన్న గృహస్థు. సెకెండుఫారం చదువుతో పూర్తిచేసిన విద్యాజ్ఞానం పార్వతిది. బొత్తిగా పల్లె టూరు కావటంవల్ల ఏమాత్రం వైజ్ఞానిక వాతా వరణంకాదు. అందువల్ల లలితకళా ప్రవేశానికి కూడా అవకాశంలేకపోయింది. ఏవో పూజపాటలు, జోలపాటలు మినహా, సినిమా పాటలు కృతులు వగైరా కచ్చేరి పాటలురావు. తొలిచూలు బిడ్డ పార్వతి. తండ్రికి పెండ్లి చేయటం విషయంలో అను భవములేదన్న మాట. చాలా ఘనంగాను వైభవంగాను చెయ్యాలని మాత్రం అతని వాంఛ. అలుడు చదువు కున్నవాడు. బస్తీవాడు. రూపురేఖలకు లోటు లేదు. మదనుడికైన అశరీరుడన్నలోటువుంది. అలుడు ఉమాకాంతునకదికూడ లోటులేదు. పాదరసంవంటి చురుకైన బుద్ధి. పార్వతికి అన్నివిధాల తగినవాడని నిశ్చయించుకున్నారు.

వెంకటరత్నం ఎడ్వకేటు. బస్తీలో పుట్టి పెరిగిన నవనాగరీకుడు. ఎంత నాగరీకుడైనా స్త్రీలు చదువు కొంటే సంసారం చెయ్యరనే దృక్పథం గలవాడు. అందుచేత తన ఆడపిల్లలకు ఉన్నత విద్య గఱపింప లేదు. తాను తెచ్చుకొనబోయే కోడలు కూడా సంసార పక్షమైన సెకెండుఫారం చదువు చదువుకున్నదే. మోతుబరు గ్రామకరణంగారి కుమార్తెను ఉమా కాంతునికి ఖాయం చేసుకొన్నారు.

ఉమాకాంతుడు చదువుకున్న పిల్లను చేసుకోవాలను కున్నాడు. తన భావినిగురించి విద్యార్థి దశలో ఎవోకలలుగన్నాడు. నాటి ఆశాసౌధాలన్నీ నేడు వమ్మైనాయను కుంటున్నాడు. రాబోయే కాబోయే ప్రేమ దేవతను గూర్చి ఏమో ఆలోచిస్తున్నాడు. నిజానికి తానంతట తాను మనస్ఫూర్తిగా ఒప్పుకోన లేదు. కాని తండ్రి చెప్పుచేతలలో పెరిగిన వాడు కావటంవల్ల పెళ్ళి విషయంలో పెంకితనం చేయలేక పోయాడు. బి. ఏ. పాసయ్యాడు. మగవాడైతే మాత్రం పెండ్లి విషయంలో అశ్రద్ధ జేస్తారా? 'బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినావంగవు' అని సామెత వుండనే వున్నది. అంటే స్త్రీలకే గాక పురుషులకుకూడా వివాహానికి వయఃపరిమాణం వున్న దన్నమాట.

పార్వతి తొలిచూలు బిడ్డగనుక అంతగా పని పాటలు చేతగావు. చెయ్యవలసిన అవసరం కలుగ లేదుమరి. అంటే నిత్య కృత్యాల్లో దైనిక జీవితంలో అవుసరమైన పనులుగూడా పనితనంగా చేయలేదు. జడవేసుకోటం, బట్టలుతకటంగూడా రాదు. ఆమె మనసులో వెళ్లబోయే క్రొత్తయింటి పరిసరాలను గురించి, వాతావరణాన్ని గూర్చిన ఆలోచనలే పెద్దగా చెలరేగుచున్నాయి. ఇంకమీదట తాను కన్యగా ఒంటరిగా వుండబోదు. మిధునంగా ద్వయం కాబోతోంది. తానేపనిచేసినా, ఎట్లా నడుచు కున్నా మరొకవ్యక్తి అభీష్టానికి వ్యతిరేకించకుండా, అభిమానాన్ని, ఆదరణను చూరగొనాలి. తనపలుకు, పని తనకు నచ్చితే చాలదు. మరొకరికి కూడా నచ్చాలి. అది ఆమె జీవితంలో రాబోయే మార్పు. ఒక యువతి ధర్మపత్నియై గృహిణికాబోతోంది.

ఆమెకు పురాణాలలోను, హరికథలలోను, విన్న సీత, సావిత్రి, అనసూయ మొదలైన పతివ్రతల చరిత్రలే ఆదర్శం. తాను తన ఆదర్శ పాతివ్రత్యం ద్వారా భర్తప్రేమను అభిమానాన్ని చూరగొనదలచింది. తన బాల్యమిత్రులను విడిచిపోతున్నందుకు, తల్లిదండ్రులనుండి దూరమౌతున్నందుకు మనసులో బాధ, భయం, విద్యావివేక సంపన్నుడైన ఒక సుందరరూపును పొందగల్గినందుకొక సంతోషం ఒక అభిమానం పెల్లుబుకుతున్నాయి. లగ్నంనాడు స్నేహితురాండ్రంతా చుట్టుచేరారు. ఏవో సరస సల్లాపాలు ఆడుకుంటున్నారు. పురోహితుడు వచ్చి పెండ్లికూతురెక్కడ అంటూ స్నేహితుల మధ్యనుండి పెండ్లికుమార్తెను విడదీసాడు.

పెండ్లి అయింది. యథాప్రకారంగా, విధియుక్తంగా కార్యకలాపాలు పూర్తియైనాయి. మనుగుడుపులకు పెళ్లివారంతా వచ్చారు. పార్వతికి భిడియం హెచ్చు. ఎక్కడో ఒంటరిగానో తనవాళ్ల మధ్యనో కూర్చుండేది. ఉమాకాంతుని నీడపడితే నెమ్మదిగా జారిపోయేది, ఆ పరిసరాలు విడిచి. ఉమాకాంతుని మిత్రులంతా పెండ్లికివచ్చారు. తిరిగి యింటికి వచ్చాక వాళ్లందరకు విందుచేశాడు. మిత్రులంతా పార్వతి చేత పాటలు పాడించమన్నారు ఉమాకాంతుణ్ణి. పాపం తనకుగాదు తనుగన్న తల్లికి కూడా సాధ్యంకాలేదు. పార్వతి చాలా భయపడటమేగాదు, పాడలేక పోయినందుకు నొచ్చుకుంది. ఆమెకు ఆధునిక దాంపత్య ప్రేమ కలాపాలతో పరిచయంలేదు. ఇదే మొదటి అనుభవం. ఈ విషయంలో భర్తకోర్కెను తీర్చలేక పోయినందుకు తానసమర్థురాలననుకుంది. మొదటి కోర్కె విఫలమైన ఉమాకాంతుడు తనపట్ల ఏవిధంగా ప్రవర్తిస్తాడోనని సందేహిస్తోంది.

ఒంటరిగా గదిలో వుండగా వెళ్లాడు ఉమాకాంతుడు ఏదో పలుకరించాలని. మంచంమీద పడుకొనివుంది. అప్పుడే ఆలోచనల నరికట్టి నిద్రకుపక్రమిస్తోంది. ఉమాకాంతు గుమ్మంలోనున్నాడు. పార్వతీ! అన్నాడు చొక్కాతొడుక్కుంటూ! ఉలిక్కిపడిలేచింది భయవిస్మయాక్రాంతయై పైటచెరగు సర్దుకుంటూ లేచీ నిలబడింది తలవంచుకొని. పట్టు సరిచేసికొంటూ గుమ్మంలో నిలబడ్డాడుమాకాంతుడు. వెళ్లటానికి ఉండటానికి గాని పరిస్థితిలో వుంది. ఏంచెయ్యాలో తెలియటంలేదు పార్వతికి. మళ్లీ ప్రశ్నించాడు. "ఏంభయమెందుకు? ఎవరని భయపడుతున్నావు? నీకు పాడటం వచ్చునా? పాడగలవని అన్నారు మీవాళ్లు." అని ప్రశ్నలవర్షం కురిపించి, ప్రశ్నలకు కారణాలు చెప్పాడు.

నిజమే. పాడగలందుకు మంచికంఠమేవుంది. కాని వుపయోగించుకొనేందుకు తగిన వాతావరణంలో పెరిగిందికాదు. ఏవో పూజపాటలు ఆధ్యాత్మరామాయణకీర్తనలు, మంగళహారతి పాటలవంటివే కాని సినీ పాటలు తాళయుక్తమైన శాస్త్రసంగీతం రావటానికి తగిన అవకాశాలులేవు. ఆ విషయం తెలిసికొని కావాలని కోరితెచ్చుకున్నాడు కలవారి ఆడబడుచును కోడలుగా! ఇప్పుడీవిధంగా ప్రశ్నిస్తే యేం సమాధానం చెప్పగలదు?

పాపం! చివరకు ధైర్యం తెచ్చుకుంది తాత్కాలికంగా. తలక్రిందుకి దించుకొని భయాన్ని దిగమ్రింగుతూ "నాకేమివచ్చునో మీకు తెలుసునుగా! తెలిసిన విషయాన్ని నన్నడిగితే నేనేంచెప్పను?" అని తనసమాధానంతో విరమించబోతోంది. "ఇంతేనా నీ గాజుకన్ను గాంభీర్యం" అంటూ వెళ్ళిపోయాడు. పార్వతి క్షతగాత్రయై ఏమీతెలియని వ్యథతో కుమిలిపోతోంది. ప్రథమ సంభాషణలోనేనా ఈ యవమానం. సహించలేక పోయింది మనోవ్యథ. తానెంతగానో వూహించుకొంది ప్రథమ ప్రణయ ప్రస్తావనను. కాని నేడు భగ్నమైంది.

ఉమాకాంతుడు మరునాడు మిత్రులతో షికారు వెళ్లాడు. అచ్చటినుండి సినిమాకు వెళ్లాడు. ఉమాకాంతుని చెల్లెళ్లు వినత, లలితలు సినీమాకు సంసిద్ధులై వున్నారు. ఉమాకాంతుడు యింట్లో వున్న చెల్లెళ్లను క్రొత్త సభ్యురాలు పార్వతిని తీసికొని సినీమాకు వెళ్లాలనుకున్నాడు. కాని భార్యకు ఉన్నతవిద్యా

విజ్ఞానాలు లేవని తనతో తీసికొని వెళ్లటానికి సంశయించి యింటికి రాకుండానే వెళ్లిపోయాడు.

సినీమాకు పోయేవాళ్లున్న ముగ్గురు పరిపరి విధాల తలపోశారు. పార్వతి వెంటనే వూహించుకొంది. తానెన్నో ఆశాలతలనల్లుకొంది. తను పెరిగింది పల్లెటూరి వాతావరణం. అజ్ఞానతిమిరం. అయినప్పటికీ బస్తీవాసం, విద్యా, విజ్ఞాననిలయం కాబోతున్నందుకు సంతోషించింది. ఏవో క్రొత్తవిషయాలు, ఎన్నో తెలుసుకొనగల ననుకుంది. కాని నేడు ఆశాలతలచిగుళ్లే వడిలి పోతున్నాయి.

ఉమాకాంతుడు సినీమానుండి తిరిగివచ్చాడు. పార్వతి ఏదో ఆలోచిస్తూ పడుకొనివుంది. ఏమీ మాట్లాడకుండా చొక్కా విప్పుకొని భోజనం చేశాడు. అన్నయ్య గనుక లలిత అడిగింది "అన్నయ్యా! సినీమాకు తీసికొని వెడతానన్నావు. మమ్మల్ని తీసికొని వెళ్ళలేదేం? ఎంతో సేపు నీకోసం ఎదురు చూచాం. తెలుసా!" అంటూ తన అమాయకత్వం వెలిబుచ్చుకొంది. "ఏదో మా స్నేహితులతో కలిసి వెళ్లిపోయాను. కావలిస్తే రేపు మీరు వెళ్లండి" అని ఉమాకాంతుడు సర్దుకున్నాడు.

పార్వతికి ఎలానడుచుకోవాలో తెలియటంలేదు. ఉమాకాంతుడు నవీన నాగరికత కలవాటుపడ్డాడు. తనకత్యంత సన్నిహితంగా అత్యంత ఆప్తురాలుగా వుండగలదనుకున్న తన ప్రేమపాత్రురాలు గావలసిన భాగ్యదేవత ఎందుకో కొంచెం కొంచెం మనోసామ్రాజ్యానికి దూరం కావలసివస్తోంది. తానెన్నడూ వూహించుకోనలేదు ఈ విధంగా మార్పువస్తుందని. తాను, తన భాగ్యదేవత పూవులో తావిగా, తావిలో మధువుగా, వెన్నెలలో వెల్లులాగా లీనమై రాధామాధవుల ప్రణయగాన మాలాపిద్దామనుకున్నాడు. కాని నేడు తానూహించిన ఆశాసౌధాలు ఒకటొకటిగా కూలుతున్నాయి. తన కేదో ఒక చీకాకు కల్గుతోంది యింటికి వస్తే. మనసిచ్చి కడుపునిండా కబుర్లు చెప్పుకొనేందుకు నోచుకోలేదనుకున్నాడు.

ఒక ఆఫీసుకీ యిల్లు అనే త్రాడుతో కట్టబడ్డ జీవిత విధానం వద్దనుకున్నాడు. స్వేచ్ఛావాయువులు పీల్చేందుకు పలురకాలైన సభ్యతల వారిని, వారి వారి ప్రాంతాలను చూడాలని అందుకు తగిన వృత్తిని ఏదు కోవాలని అనుకున్నాడు. ఏదైనా యంత్రపరికరమును ఏజన్సీ తీసికొని దేశంలో చాలభాగం చూడవచ్చునను కున్నాడు.

సైకిళ్లు, వాటి భాగాలకు వ్యాపారం ప్రారంభించాడు, ఉమాకాంతుడు మరొక మిత్రుడు రవి ప్రకాష్‌తో కలసి. అనేక ప్రాంతాలు వ్యాపారాభివృద్ధికొఱకు తిరుగ నారంభించారు. తిన్నవూళ్ళో వుండకుండా వున్నవూళ్ళో తినకుండా అనేక పట్టణాలు అనేక ప్రాంతాలు తిరిగారు.

మిత్రు లిద్దరిలో ఉమాకాంత్ మంచి కుశాగ్రబుద్ధిగలవాడు. అంతేగాక ప్రాంతీయభాషలు నేర్చుకొనుటకు తగిన శ్రద్ధ, ఆసక్తిగలవాడు. అందువల్ల తక్కువ వ్యవధిలో ఎక్కువ భాషలు నేర్చుకోగలిగాడు. ఈ ప్రయాణాల్లో ఒకమాటు సేలంనుండి మద్రాసువచ్చే ఎక్స్‌ప్రెస్‌లో మిత్రు లిద్దరు యెక్కారు. కాట్పాడి వరకు వచ్చారు. కాట్పాడిలోదిగి హోటల్‌కు వెళ్ళివచ్చారు.

కాట్పాడిలో ఒక నవనాగరికత తెలిసిన విద్యావంతురాలు వీళ్లున్న పెట్టెలో యెక్కింది. చాలమంది స్త్రీలున్నారప్పటికి. క్రమంగా స్త్రీలు దిగిపోతున్నారు. పురుషులు ప్రవేశిస్తున్నారా పెట్టెలోకి. ఏదో సందర్భంలో ఉమాకాంతుడామెను పలుకరించాడు. ఆమె సమాధానంచెప్పి వూరుకొంది. నెమ్మదిగా కొన్ని సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక విషయాలు చర్చించారు ఆమెతో.

ఆమె పేరు ఉషాదేవి. మద్రాసులో మహిళా సభలో చదువుతున్నది. లలిత కళలలో బాగా ప్రవేశంవుంది. ఐదారు భాషలు వ్రాయను, మాట్లాడను యెరింగిన వ్యక్తి. ఆమె మాతృభాష కన్నడం. కాని తెలుగులోకూడా బాగా పరిచయముంది.

బి. ఏ. ప్రైవేటుగా చదువుతోంది. భాషాపరిచయమేగాక వాటి సాహిత్యపరిచయం, కవితా, రచనల పరిచయాలుకూడా వున్నాయి. రూపు రేఖలకు తీర్చి దిద్దినట్లుంటుంది. ఏప్రాంతపు దుస్తులు ధరిస్తే ఆ ప్రాంతీయురాలనిపిస్తుంది. చక్కని కంఠము. కంఠం విప్పితే కోకిలలు శృతి వెయ్యాలి - నెమళ్లు నృత్యం చెయ్యాలి. ఆమె యెరుగని వయసులో ఆమెకు పెండ్లికావటం, అది విఫలమై వితంతువగుట జరిగిపోయింది. అదికూడా అక్షరాభ్యాసం కాకమునుపే.

ఆమెలో హైందవత్వం మూర్తీభవించివుంది. ముఖంచూచి బొట్టుపెట్టుకోనవచ్చు. సంస్కృతం పంచకావ్యాలు చదివింది. ఇంతాజేస్తే వయసు యిరువైయొక్క సంవత్సరాలు. ఆమె సౌందర్యానికి ముగ్ధులై ఆమె కన్జూపుల సుధావృష్టికి పరితపించే తృషితులెందరో వున్నారు. కాని నేటి నవనాగరికత లోని అమానుషత్వం ఆమెను ఒక మంత్రముగ్ధగా మార్చివేసింది. ఏమానవుడైనాసరే ఆమె దృష్టిలో ఒక పతితుడుగా కన్పిస్తున్నాడు. ప్రతివ్యక్తి చూపులలోను ఒక కాలుష్యం, ఒక కఠినత్వం గోచరిస్తోందామెకు. అందుకే ఏదో పుస్తకం చదువుతూ, ఏదో చేతిపని, అల్లికపనిచేస్తూ తన దృష్టిని పాప పంకిలమైన ప్రపంచపు దృశ్యాలనుండి తప్పించుకొంటుంది.

ఉమాకాంతుడు ముగ్గురకు పాలు తీసికొన్నాడు. ఉషాదేవి యిష్టంలేకపోయినా మర్యాదకు లాంఛన ప్రాయంగా తీసుకోనక తప్పలేదు. ఉమాకాంతుడు తన అనుభవాలను అనుమానాలను ఒక్కటొక్కటే అడిగి తెలుసుకొంటున్నాడు. స్త్రీలకుండే ప్రతిబంధకాలు, క్లిష్టపరిస్థితులు అనేకం చెప్పింది ఉష. స్త్రీలకు స్వాతంత్ర్యం యిచ్చామంటారు తగిన సావకాశం లేకుండానే. ఇస్తే వుపయోగించుకోనలేని విజ్ఞాన విహీనులను తయారుచేస్తోంది సంఘం. తమకు అక్కచెల్లెళ్లులేరా? వుంటే పరాయి స్త్రీనెందుకలా దృగ్జ్వాలలతో భస్మంచేయ బూనుతారు? హృదయంలేదా? వెర్రిచూపులకు బెదరి లొంగిపోతుందా స్త్రీ? స్త్రీకి తన కర్తవ్యం తెలియదా? పురుషులముగదాయని తమకున్న విజ్ఞానం, వివేక వ్యర్థంగా నాశనం చేసుకొంటారా? ఛీ! పాపిష్టి విద్యాజ్ఞానం! తన తప్పును గుర్తించలేని చదువెందుకు? తన తప్పుకు పశ్చాత్తాపపడని విద్యాజ్ఞానం యెందుకు? అట్లాంటప్పుడు చదువుకున్నామనుకునే నిరర్ధక దురహంకార జీవులకంటే పశుపక్ష్యాదులు మేలు, ఒకరికి హానిలేకుండా తమకు తాము జీవిస్తాయి అంటూ ఒక మహోపన్యాసం చేసింది.

రవిప్రకాష్ అర్థంచేసుకుంటున్నాడు. "అయితే మీకు పెండ్లయిందా" అన్నాడు.

"లేదు. నాకీ పాపిష్టిమానవ సంఘాన్నిచూస్తే ఏడుపువస్తుంది. ఎన్నటికైనా కనువిప్పు అనేది వున్నదా సంఘానికి! అని తద్వారా దేశానికి, ప్రపంచానికి భుక్తి ముక్తి వుంటాయి అని తనను తాను పరికించి పరిశీలించుకొంటే యెన్నో లోపాలున్నాయి. అద్దంలో ప్రతిబింబించినట్లు తన హృదయ ఫలకంపై కన్పించి పలుకరించి కవ్వించేవి, అవి సవరించుకొనటంద్వారా సంఘం, దేశం, ప్రపంచం చక్కబడుతాయి."

"ఇన్ని విషయాలు తెలిసిన మీరు అవివాహితులుగా వుండటానికి కారణం? స్త్రీ సహజంగా సుకుమారంగా సునిశితంగావుండే లతవంటిది. ఆధారం లేక మన లేదీసంఘంలో! చదువుకుని సంఘానికి సేవ చేస్తారా? వివాహం చేసుకొంటారా" అన్నాడుమాకాంత్.

"ముఖ్యంగా ప్రస్తుత కాలంలో సంఘంలోని పెద్ద పిశాచం దహేజ్ - అంటే కట్నాల రివాజు. ఇది రూపుమాసేవరకు సంఘానికి సుభిక్షం దేశానికి కల్యాణం లభించవు. తాను సమర్థుడను భార్యను పోషించగలను, అని ధీమావుంటే కట్నందేనికి? మనోవర్తిలా పుచ్చుకొని నాటకమాడటానికా!" అంటూ సవాల్ చేసింది ఉషాదేవి.

"అయితే ఎదుటి పక్షంనుండి చదువు, సంపద, భూమి, వసతి వున్నాయా అని, వివేకం విజ్ఞానం వున్నాయా అని ఎదురుచూస్తారెందుకు? మీ పక్షం నుండి మీరు దానిని కాంక్షించినప్పుడు వాళ్లు మీ నుండి కట్నం ఆశించటం తప్పుగాదేమో! వినయ విధేయతలు మాత్రం వాంఛించబడుతాయి" అని దహేజ్ రివాజును బలపరచాడు ఉమాకాంత్.

ఆజన్మ బ్రహ్మచారియైన భారత పితామహుడు భీష్మాచార్యుడు అంపశయ్యమీదనుండి ఉత్తమ వైవాహిక లక్షణములనుగూర్చి ధర్మరాజున కిట్లాదేశించాడు.

"కులమును విద్యయు శీలము గల
వానిని పిలిచి ప్రీతి కన్నియ నీగా
వలయునుదక ప్రధాన కవితంబుగ
బ్రాహ్మ కర్మగతి యిది యధిపా!"

ఇది సార్వజనీన సార్వకాలిక మహోత్కృష్ట ధర్మంగా స్వీకరించదగినది. అయితే విద్యాయోగ్యతలుగలవాడు కట్నం అడుగకూడదు. అడిగినట్లైతే అవిలేవన్నమాట" అంది ఉషాదేవి.

"మీ వివాహం మీరే చేసుకొంటారా? తల్లిదండ్రులపై ఆధారపడి వుంటుందా? మీకు నచ్చిన వ్యక్తిని మీరు చేసుకొనగలరా" అని ప్రశ్నించాడు రవిప్రకాష్.

వైవాహిక జీవనమైనా అవివాహిత జీవనమైనా 'మానవసేవ' మానవ కర్తవ్యం! ఫలాపేక్షలేని నిష్కామకర్మ నీచే వాంఛింపబడినప్పుడు నీవొకరి మెడకు ఉరిబోయ నక్కరలేదు. ఉరిబోయించుకో నక్కరలేదు. నీవు నీ పరిసరాలను పరిశుద్ధపరుచుకొని నిన్ను నీవు గుర్తించుకోగల్గినప్పుడు నీకి ఆటంకాలు కానరావు. నీ యింద్రియాలు నీ ఆధీనంలో వుంటే నీవు యింద్రియాధీనుడవు కాకుంటే నీ అంతరాత్మ ప్రబోధము నీకు స్పష్టంగా వినబడుతుంటే నిన్ని బాహ్య ప్రపంచంలో ఎదిరించే శత్రువులేదు. నీ తప్పులు నీవు గుర్తించుకో! లోకం యెప్పుడూ నిష్కల్మషమైనదే! నీ దృష్టిలో దోషముంటే నీకు కన్పించే యీ బాహ్య ప్రపంచం దోషభూయిష్టమైనదే అని తలంచకు. అందుకని నిన్ను నీవు అర్థం చేసికో! ఇతరులను విమర్శించి నిన్ను నీవు వంచన చేసికోనకు" అంటూ ఉపదేశాత్మకంగా ఉద్బోధించింది ఉష.

ఆ గుణపాఠంవిని ఉమాకాంత్ ఆమె ఎడ్రసు అడిగి వ్రాసుకొన్నాడు. "మద్రాసులో మిమ్మల్ని కలుసుకోటానికి వీలుంటుందా" అని ప్రశ్నించాడు. ఆమె అంగీకరించింది. ఉష మద్రాసులో దిగింది. రవి ఉమ విజయవాడ చేరుకున్నారు.

రవిప్రకాష్ అవివాహితుడు. వయసు పాతిక వుంటుంది. త్యాగశీలస్వభావాలుగలవాడు. పొడగరి హృదయుడు. ఉషాదేవికి జాబులువ్రాయ నారంభించాడు. తన జీవితంలో ఎదుర్కొనవలసిన క్లిష్ట సమస్యలకు సలహాలు తీసికొంటున్నాడు ఉషాదేవి నుండి. ఆమెలోని స్వేచ్ఛ, స్వేచ్ఛా, సేవాభావాలు అతనిలో అంకురించి, చిగిర్చి పుష్పించాయి. సర్వోదయ సిద్ధాంతాలు ఇద్దరిలో బాగా జీర్ణించి వంటబట్టినాయి. పూజ్యబాపూ సేవాభావాలు వీరి హృదయ క్షేత్రాలలో నాటుకొని ఈ విధంగా ఫలోన్ముఖమౌతాయని యెవరెరుగుదురు?

ఉమాకాంతునిలో చాలా మార్పు కనుపించింది పార్వతికి. ఏనాడూ కలలోనైనా తన భాగ్యచక్రం మారుతుందని అనుకోలేదు. ఎన్నో నోములు నోచింది. నోముల ఫలమో! ఉషా ప్రబోధమో!!

# ప్రముఖ అమెరికన్ నీగ్రో మహిళ బెథూన్ సతి మరణం

---

నీగ్రో మహిళల జాతీయ సమితి స్థాపకురాలు, అమెరికా ప్రభుత్వ సలహాదారిణి, శాన్ ఫ్రాన్సిస్కో సమావేశ సందర్భంలో ఐక్యరాజ్య సమితి సలహాదారిణి అయిన మేరీ మేక్లియాడ్ బెథూన్ సతి తన 79వ యేట ఈ మధ్య హృద్రోగం వల్ల మరణించింది.

ప్రపంచంలోని ప్రముఖ నీగ్రో విద్యావేత్తలలో బెథూన్ సతి ఒకతె. మైనారిటీల వ్యవహారాల విషయంలో అమెరికా ప్రెసిడెంటులకు సలహాదారిణిగా ఈమె పది సంవత్సరాల పాటు పనిచేసింది. లైబీరియా ప్రెసిడెంట్ పదవీ స్వీకరణోత్సవ సందర్భంలో ప్రసిడెంట్ ట్రూమన్ ప్రతినిధిగా ఈమె 1952లో పనిచేసింది.

భారతదేశంలో ఈమె శ్రీమతి విజయలక్ష్మీ పండిట్‌ను కలుసుకుంది. రంగు జాతుల అంతర్జాతీయ సమితిలో ఆమెతో కలిసి పనిచేసింది.

పూర్వం బానిసలుగా వున్న నీగ్రో దంపతుల్దిరికి పుట్టిన 17 మంది బిడ్డలలో బెథూన్ సతి ఒకతె. ఒక చిన్న మిషన్ స్కూలులో ఈమె విద్యాభ్యాసం ప్రారంభించింది. తరువాత ఆమె ప్రత్తితోటలలో పనిచేసింది. పొరుగునవున్న ఉపాధ్యాయురాలొకాయన ఈమెమీద జాలికలిగి, డబ్బు కూడబెట్టి ఈమెకు చదువు చెప్పించాడు. బెథూన్ సతి కూడా నీగ్రో బాలికలకు ఇటువంటి సహాయం చేసింది. బాలికా పాఠశాల నొకదానిని ఆమె స్థాపించింది. ఈ పాఠశాల బాలుర పాఠశాలతో మిళితమై బెథూన్‌కుక్‌మన్ కళాశాలగా మారింది.

బెథూన్ సతి నీగ్రో మహిళల జాతీయ సమితిని 1935లో స్థాపించి 1949 నవంబరు మాసంవరకు ఆ సంస్థకు అధ్యక్షురాలుగా పనిచేసింది.

8,00,000 సభ్యురాండ్రు గల ఈ సంస్థకు ప్రస్తుతం అధ్యక్షురాలుగా పని చేస్తున్న విలియమ్ థామస్ మేసన్ సతి ఇలా అన్నది. "నీగ్రో ప్రజలను, సమస్యలను, అమెరికా ఆదర్శాలను బెథూన్ సతి ఎంతో బాగా అర్థంచేసుకున్నది. అందువల్లనే జాతుల సమైక్యతకై ఆమె అనేక విధాల కృషి చేసింది."

'యు. యస్. ఐ యస్.'

# పిడకల గంప

శ్రీ కావుటూరు వెంకటనారాయణరావు

రాజుకు బదిలీ అయింది. అతను మొట్టమొదట సారిగా పల్లెలకు బదిలీకావడంతోటి, అతనిలో యేదో చెప్పలేని బాధ చెలరేగి, మనసును కల్లోలపరిచింది. అతనింతవరకు పట్నవాసపు మురికిసందులు దాటి, యెల్లప్పుడూ కార్లు, సైకిళ్ళ రణగొణ ధ్వనులను వినకుండా యింతవరకు వుండలేదు! బస్తీలోని యెర్రమట్టితో అతను కలిసి పోనిరోజు యింతవరకూ రాలేదు. సాయంత్రమయేటప్పటికి విద్యుద్దీప కాంతులు చూడకుండా ఒక్కక్షణముండలేదు. ఆ కాంతుల కలయికలో తను స్వర్గసుఖ మనుభవిస్తాడు. తనుండే సందులోని సర్వమాలిన్య గంధాన్ని, సుగంధంగా పీల్చని సమయం అతని జీవితంలో నీటి బుడగ లాంటిది. అందుకనే, రాజు తను ప్రభుత్వానికి, లోకానికి యెంతో సహాయం చేస్తుంటే, అవి తనకు యింత అన్యాయం చేసినందుకు, తనకు అనుకూలించని యితర పరిస్థితులనుకలిపి, అసహ్యించుకుని యేకంగా తిట్టుకున్నాడు.

రాజు సెకండరీగ్రేడు పూర్తిచేసి రెండు సంవత్సరాలయినప్పటికీ బస్తీలోనే గడిచిపోయింది. మోటు జీవితమంతా పల్లెపట్టులో వుందనుకుంటాడు. తన కక్కడ కాలకృత్యాలు తీర్చుకోకముందే బెడ్ కాఫీ యెవరిస్తారు? బస్తీలో అయితే హోటలయ్యరు కాఫీ ఆవిర్లతో తన్నాహ్వానిస్తాయి. రాజుకు రెండిడ్లీలు, నిండా సాంబారుతోవున్న ప్లేటు కళ్లకు కట్టేటప్పటికి, వుద్యోగం వదిలివేద్దామన్నంత కోపం వచ్చింది.

బస్సులో ముందుసీటులో కూర్చుని తనను వదిలిపోతున్న బస్తీలోని హోటళ్లను, ఆఫీసులను, నాటకశాలలను, సినిమారంగాలనుచూచి, స్వర్గంనుండి భూలోకచ్యుతుడైన నహుషునిలా బాధపడ్డాడు. ప్రయాణంలోనే తన్నానుకుని కూర్చున్న పెద్దమనిషితో బాగా పరిచయమయింది రాజుకు. అతని పరిచయంతో రాజుకెంతో సంతోషమయింది. తను పల్లెలకుపోవడం క్రొత్త! అక్కడ తనకెవ్వరూ తెలియదు! తను నివాసానికి యెంతగా కష్టపడాలో అని ఆలోచించుకుంటున్న రాజుకు ఆ సంశయాలన్ని తెగదెంపులయ్యాయి. తనకు పరిచయమైన ఆ నూతన వ్యక్తి తను పోబోయే పల్లె కరణమే! అతని పేరు వీరరాఘవనాయుడు. నాయుడుగారితో పరిచయమైనప్పటినుండి రాజు, ఆ వూరి ప్రకృతిని మెల్లగా ఒకటి వెంబడి మరొకటి తెలుసుకున్నాడు.

రాజు తనకు బదిలీఅయినచోట అడుగు బెట్టినపుడు నాయుడు తన స్వగ్రామంగూర్చి యేమీ పొగడలేదనుకున్నాడు. తనకు మంచి వసతి, బడికి ప్రక్కగా పెంకుటిల్లు - లోపల శుభ్రంగా గచ్చుపూసివుంది. ముందర ఓ, వేపచెట్టు, నాలుగు పూలమొక్కలు వున్నాయి. రాజు ఆ వసతికెంతో సంతోషించాడు. తన గది కెదురుగానే వూరి మంచినీటి బావి. తను ప్రొద్దుననే లేచేటప్పటికి, పల్లె సౌందర్యం కళ్ళారా చూడవచ్చుననుకుని సంతోషించాడు.

వూరు యేమంత పెద్దదిగాదు. ఓమైలు పొడవు, ఓ అరమైలు వెడల్పూ వుంటుంది. చాలా వరకు వూరికొంపలన్నీ అగ్ని దేవునికి భయపడి మిద్దెలుగా, పెంకుటిల్లుగా మారిపోయాయి. వూరికి రెండు దిక్కులా రెండు చెరువులున్నాయి. తూర్పు చెరువు గట్టుమీద నాగేశ్వరుని ఆలయం. వూరిలో ఓ పది వైశ్యకుటుంబాలున్నాయి. తక్కిన వారిలో ఓ మూడు బ్రాహ్మణ కుటుంబాలు.

సాయంత్రం పనిముగించుకొని, రాజు చెరువుగట్టు మీది నాగేశ్వరాలయానికి వెళ్ళాడు. ఆలయం ముందు ఓ పెద్ద నందీశ్వరుని విగ్రహం గంభీరంగా వుంది. దాన్నానుకుని ఓ ముప్పయి అడుగులయెత్తున

ధ్వజస్తంభం. దాని చిరుగంటలు గాలికి గణగణ మంటూ యెంతోహాయి గొల్పుతున్నాయి. ఆ ధ్వజస్తంభంచుట్టూరా ఓ పదడుగుల వ్యాసంలో ఓ అరుగు. ఆ అరుగుమీద కూచుంటే చెరువులోని యెర్రనీటిని తాకివస్తున్న పిల్లవాయువులు కూని రాగాలు తీస్తున్నాయి. ఆ దృశ్యం రాజుకెంతో మనోజ్ఞంగావుంది. అక్కడినుండి కదలలేకపోయాడు. అక్కడి పిల్లగాలులకు తన శరీరం తేలిపోయింది.

రాజు అక్కడికి చేరుకునేటప్పటికి ఆలయం తలుపులు తీసివున్నాయి. మెల్లగా లోనికి వెళ్ళాడు రాజు. లోపల అర్చకుడు మంత్రోచ్చారణతో తన ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాడు. రాజుకు తెలియకుండానే అతని రెండుచేతులు కలుసుకున్నాయి. అలా చేతులు రెండూ జోడించి, కండ్లు రెండూ మూసుకుని యెంతసేపు నిలిచాడో అతనికే తెలియదు. బైటికి వచ్చేటప్పటికి వూరి పెద్దలు నలుగురు అరుగుమీద వుండడం చూచాడు. మరలా లోనికి వెళ్లాడు రాజు. ఆలయంలోని శివుని లింగం చూస్తుంటే, తను బస్సులో ప్రయాణం చేస్తుంటే, నాయుడుగారిద్వారా విన్నమాటలన్నీ వూహకు వచ్చాయి. అది పుట్టులింగమట! ఆ వూరివారి భక్తికి అదక్కడ వెలసిందట! ఆ లింగంమీద ఓ అయిదుతలల నాగసర్పం, రాగితో చేసింది పెట్టివుంది. నాగేశ్వరుడు తూర్పు ముఖంగా వున్నాడు. దక్షిణ ముఖంగా పార్వతి వుంది. ఆలయంచుట్టూరూ తిరిగాడు ఒకసారి రాజు. ఒక తట్టు వినాయకునిగుడి నేరుగావుంది. మరొక తట్టు మూగ సిద్ధయ్య విగ్రహం. చెరువులోని మెట్లకు మూరెడుదూరం యివతల లింగాకారంలో ఓ తెల్లనిబండ. అదేమిటో రాజుకు తెలియలేదు. ఇవన్నీ చూచుకుని, అరుగు చేరుకునేటప్పటికి, అక్కడివారు యేదో మాట్లాడుకుంటున్నారు. వారిలో నాయుడుగూడా వుండడంచూచి రాజు సంతోషంతో నమస్కరించాడు. నాయుడు ప్రతి నమస్కారంతో అక్కడి పెద్దలకు రాజును పరిచయంచేశాడు. రాజు గూడా వారి ప్రక్కనే అరుగుమీద కూర్చున్నాడు.

"ఏమండి రాజుగారు! దేవుణ్ణి చూచి వచ్చారా?" అన్నాడు నాయుడు. దానికి రాజు మెల్లగా నవ్వుతూ "ఆ! నా జీవితంలో వూహ తెలిసినప్పటినుండీ యిదే మొదటిసారి!" అన్నాడు.

రాజు అన్నమాటలకు నాయుడు కళ్లు చాటంతవి చేసుకుని అతనితట్టు చూడసాగాడు. చుట్టున్నవారు కూడా ఆశ్చర్యపడ్డారు.

"ఆ! బస్తీలో యింతకంటే గొప్ప ఆలయాలున్నా నేను, వాటితట్టు పోయిన పాపానపోలేదు. కాని యీ రోజు, ఆలయంలో అడుగుబెట్టానో లేదో, యేదో తెలియని ఆనందం నన్నావరించింది. నా కళ్ళలానే మూతలు బడ్డాయి. అప్పటికి యిప్పటికి నాలో యేదో మార్పు! బస్తీయే స్వర్గమనుకున్న నాలో యేదో నూతన చైతన్యం పొడచూపింది."

అప్పటికి పూజ పూర్తిచేసుకుని అర్చకుడు బైటికి వచ్చాడు. అతన్నిచూచి నాయుడు తదితరులు నమస్కారం చేశారు. రాజు అతన్నిచూస్తూ నమస్కరించడంకూడా మరిచిపోయాడు. దగ్గర దగ్గర యెనిమిదో పడిలో వున్నాడా అర్చకుడు. తనువు కొద్దిగా వంగివుంది. తలమీద ఒక్క వెంట్రుక లేదు. చర్మమంతా ముడుతలుబడి తళతళ మెరుస్తూవుంది. మెడలో ఓ రుద్రాక్ష, తులసిపూసల పేరుంది. ఫాలం, దండలు, హృదయం విబూధి రేఖలతో నిండివుంది. అతని నేత్రాలలో నిర్మలమైనకాంతి ప్రతిఫలిస్తూవుంది. యెడమభుజంమీదినుండి మూడు పోగులు హృదయం మీదుగా వేలాడుతున్నాయి. వాటినిచూచి, అతనింకా బ్రహ్మచారని తెలుసుకుని ఆశ్చర్యపోయాడు రాజు. అతనే రాజును చూచి, కరణం వీరరాఘవనాయుడుతో—

"యేరా వీరయ్యా! యితనెవరు?" అని అడిగాడు.

"అతనా! క్రొత్తగా నిన్న వూరిలో పిల్లల చదువుకగాను బదిలీ అయ్యాడు స్వామీ! వూరికి క్రొత్త," అని చేతులు కట్టుకున్నాడు. రాజు అర్చకునికి

"నమస్కారం తాతగారూ!" అని నమస్కరించాడు. అతను చిరునవ్వు నవ్వాడు.

"మంచిది నాయనా! నీపేరేమిటి?"

"రాజా స్వామీ!"

"అయితే! పద అరుగుమీదకూర్చుందాం"! అని అర్చకుడు మెల్లగా మెట్లెక్కాడు. అర్చకునికి కొద్ది దూరంగా రాజు, వీరరాఘవనాయుడు, యితరులూ కూర్చున్నారు.

చెరువు కట్టమీద తాటిచెట్లు వరుసగా సమాన స్థాయిలోవున్నాయి. దూరంగా అభ్రకపుగనులు తళ తళ మెరిసిపోతున్నాయి. వుత్తరాన సిద్దప్ప కొండ సాయంత్రపు ఎండలో నీడలు తేలుతుంది. ఆ మనోహర ప్రకృతిని చూస్తూ రాజు తన్మయత్వం పొందాడు. తను పుట్టిన దినంనుండి యింతవరకు బస్తీ గోడలు దాటలేదు. కూపస్థమండూకంలా అదే ప్రపంచం, అదే స్వర్గమనుకుని మోసపోయాడు. పడమటి కొండలలో సూర్యబింబం మరుగుపడుతూ యెర్రనికాంతిని ప్రతిఫలింపజేస్తుంది. చెరువుకట్ట మీదుగా పశువులమందలు తిరిగివస్తున్నాయి. ఇలాంటివి రాజింతవరకు చూచి యెరుగడు.

రాజుకు ఆ అర్చకునిగూర్చి తెలుసుకోవాలన్న వుబలాటం జాస్తయింది. మెల్లగా "తాతగారు ..." అని ఆపివేశాడు. రాజు అడుగుతూ నడుమ ఆగిపోవడంచూచి ఆ అర్చకుడు "చెప్పు నాయనా! ఫరవాలేదు! నాకు తెలిస్తే నీ అనుమానం తీరుస్తాగా!" అన్నాడు.

రాజుకు ధైర్యం కలిగింది.

"మీరీవూర్లో యెన్ని సంవత్సరాలుగా వుంటున్నారు?"

"అదా! నేను పుట్టింది యీ వూరిలోనే, నేను యింతవరకూ అంటే నాకిప్పుడు యెనిమిదో పది సగం దాటింది. పెరిగిందికూడా యిక్కడే! చచ్చిపోవాలనుకుంటున్నదిగూడా యిక్కడే! కాని నా అదృష్టం యీ నాగేశ్వరస్వామిమీద ఆధారపడివుంది."

"అయితే తాతగారూ! యీ ఆలయం యెన్నాళ్లయింది, యిక్కడ వెలసి?"

"అయిదు తరాలనాటి మాటది నాయనా!"

"అయితే స్వామీ! ఆ తట్టు తెల్లశివలింగం వుందే! అన్ని శివలింగాలు నల్లగా వుంటాయనుకుంటాను! ఈ ఆలయానికి దానికి సంబంధమేమిటి?"

"తెలుసుకోవలసిన ప్రశ్న వేశావు నాయనా! ఈ వూరి చరిత్ర దానిమీదనే ఆధారపడివుంది!"

"అయితే మీకేమయినా తెలుసా!"

"ఆ! దాన్ని గురించి యిప్పటికి చాలామంది నన్ను అడిగారు! కాని వారికి చెప్పేటంత అవకాశం నాకు లేకపోయింది! ఆ తెల్లటి శివలింగమన్నావే దాని చరిత్ర నిజమో అబద్ధమో నాకు తెలియదు! మా పూర్వీకులనుండీ మైలురాయిలా ఒకరివెంబడి ఒకరికి తెలిపిపోతున్నారు."

"అయితే! మరి మీ అనంతరం దీని కర్చకు లెవరు తాతగారూ!"

"అది యీశ్వరుడికే తెలియాలి! నీవు చూచిన ఆ తెల్లబండను యీ వూరిలో దానిచరిత్ర తెలిసిన వారందరూ "పిడకలగంప" అని పిలుస్తారు."

"అయితే ఆ పిడకలగంపకు దాని చరిత్రకు యేమయినా పోలికవుందా తాతగారూ?"

"అదే నాయనా చెబుతున్నానుగా! ఇప్పటికి అయిదు తరాలకు పూర్వంనాటికథ. అప్పటికి యీ వూరు యేమంత పెద్దదిగాదు. ఒక అరవై కుటుంబాలతో మనుమసిద్ది మహారాజు చల్లని చూపులక్రింద యేలబడుతూవుండేది. చుట్టూరూ మామిడితోపులు, చింత, తాటితోపులతో కలకలలాడుతుండేది.

ఆ కుటుంబాలలో పది మినహాయించి, తక్కిన వన్నీ బ్రాహ్మణులవి. వారు సద్గుణవంతులూ,

సకల శాస్త్ర కోవిదులై, ఆ నాటి రాజుల మన్ననలకు పాత్రులై, సకల సౌఖ్యాలతో యెంతో వైభవంగా నివసించేవారు. అందులో గొప్పవారు ఆ నాటి రాజులక్రింద కరణాలుగావుండి పేరుతెచ్చుకునేవారు. అప్పటి వారి భక్తికిమెచ్చి యీ నాగేశ్వరుడు లింగ తట తానే వెలిశాడంటారు. అప్పటినుండీ యీ వూరికి యిలవేల్పు యీ స్వామే! ఈ దేవుని వుత్సవాలు యీ వూరికి వసంతోత్సవాలు. అప్పుడీ వూరిని వేదపురనీ, గుణపురనీ పిలిచేవారట నాయనా!

అప్పుడు వారు, రాజులిచ్చిన భూములను సస్యశ్యామలంచేసి, ఒకప్పుడు కర్షకులుగాను, మరొకప్పుడు దైవార్చకులుగాను, యితరులకు తమకు యేలాటి కష్టం కలుగకుండా తమలో తామే సంబంధాలు కుదుర్చుకుంటూ పేరుగాంచారు.

వేదమూర్తి యీ వూరికి ఆనాటి కరణం. రాజులకూ పేదలకు మిత్రుడు. అతనంటే మిగిలిన వారందరూ దైవసమానుడని తలచేవారు. అతని వొంకు లొంకుల జుట్టు, విబూధి రేఖలు, రుద్రాక్ష మాలికలు చూచినవారికి బ్రహ్మక్షాత్రమును బోధించేవట.

వేదయ్యకు ఒక్కగానొక్క చెల్లెలు గుణవతి! ఆమెకు జాతక కర్మలు చేసేటప్పుడు జ్యోతిష్కులు 'ఆమెకు భర్తలేడు! దేవుడేభర్త' అని తీర్మానించారు. అందుకు పంచభూతాలు గూడా ఘోషించాయట! ఆ మాటలతో వూరూవాడా మ్రోగింది. అందరూ ఆమె దైవాంశసంభూతురాలనుకున్నారు. ఆమె పెరిగి పెద్దదయింది.

ఆమె పెరుగుతున్న కొలది యౌవనం, దేవుని మీద భక్తి జాస్తికాజొచ్చాయి. ఆమె వైఖరిచూచి వేదయ్య ఆశ్చర్యపోయాడు. తన చెల్లెలు ఒకగొప్ప భక్తురాలవుతుందనుకున్నాడు. ఆమె నుగురించి వూళ్ళో యెన్నోవిధాల అనుకున్నారు. పూర్వం అనుకున్న మాటలు యిప్పుడు నిలిచేవిగాదు. అవి మారుతుండేవి. వాటితోగూడా వారి మనసులుగూడా మారేవి. 'ఆమె దైవాంశ సంభూతురాలట! దేవుడే భర్తట' అనికొందరు. 'యెంతగొప్పవారయినా యీడొచ్చినపిల్లను యింకా యింటిలోవుంచుకుంటారా! ఆచారాలన్నీ మంటగలుస్తున్నాయి!' యిలాంటి మాటలు గుణవతితండ్రికి ములుకుల్లా గ్రుచ్చుకున్నాయి. వెంటనే గుణవతికి పెండ్లి చేయాలని నిశ్చయించుకున్నాడు.

“కానీ వేదయ్య తన తండ్రిని గుణవతికి పెండ్లి చేయవద్దని యెన్నో విధాల చెప్పిచూచాడు ఆ మాటలతో వేదయ్య తండ్రికి పట్టుదల మరీ జాస్తయింది. గుణవతి కాపురం సాగించాలన్నాడు. తన కెదురు తిరిగితే నాశనం చేస్తానన్నాడు. అతని ఆగ్రహం చూచి వూరంతా కంపించి పోయింది. వేదయ్యకు తండ్రి నెదిరించడానికి మనస్కరించలేదు. తుదకు నాగేశ్వరుని“పాదాలకు మాసంసారాన్ని గట్టెక్కించే భారంనీదే! మాతప్పులు క్షమించి మమ్మల్ను కాపాడు దేవా” అని చేతులెత్తాడు.

ఎంతో ఆశపడి గుణవతికి వెంటనే పెండ్లి జేసిన ఆ తలిదండ్రుల ఆశ నిరాశయింది. గుణవతికి పెండ్లి జేశారనేగానీ ఆమె యే సంగతి పట్టించుకోదు. దినమంతా దైవధ్యానంలో గడిపేది. సంసారపు టొచ్చులో తగులుకోలేదు. గుణవతి అత్తమామలు తమ వంశవృక్షం కాయలు కాయబోతున్నదని సంతసించారు. వారి కోరిక తీరలేదు. గర్భాదానం నాటికి గుణవతిభర్త యేరోగం, యేఅపవాదాలేక ప్రశాంతంగా ప్రాణాలు విడిచాడు.

(సశేషము)

# సిరిసిరిమువ్వలు

మేజస్ట్రేటు:-నీవే సమయంలో అతడిని పట్టుకోకలిగావు?

ఫిర్యాది:-నిండు అమావాస్యనాడు - నడి రాత్రి - సూర్యుడు నడినెత్తిమీద నున్నాడు. పండువెన్నెలలో అతనిని పట్టుకున్నాను.

♦ ♦ ♦

ఒక టాక్సీ కొండమీదికి ప్రయాణం చేస్తున్నది. కొంతదూరంపోయేసరికి కారు ముందుకు పోకుండా వెనక్కు జారుతున్నట్లు గుపించి డ్రైవర్ "సార్! కారు క్రిందికి దిగిపోతున్నట్లున్నది - ప్రమాదం !"అన్నాడు తడబడుతూ.

ప్రయాణీకుడు. "అయితే ఫరవా లేదులే - మరీమంచిది - మైలేజిమీటరును ఆపుచేసేయి" అన్నాడు నిర్లక్ష్యంగా

'అర్జునుడు'

♦ ♦ ♦

"రాముడూ! లైబ్రెరీకి వెళ్లి ఉద్రేక పరిచే నవలలేమైనా తెచ్చిపెట్టరా"

"ఉద్రేక పరచడానికి నవలెందు కన్నయ్యా! రోజూ బాకీ డబ్బులకని తిరిగి పోతున్న కిల్లీకొట్టు నరసయ్య గొడవ చాలదూ!"

♦ ♦ ♦

"రాజీ! నిన్ను ఏమాత్రము తాకకుండా ముద్దు పెట్టుకోగలను తెలుసా!"

"బలేవాడివి !-ముద్దుపెట్టుకునేటప్పుడు పెదిమలైనా తగులవా"

"అదేలేదంటాను-అలాముద్దు పెట్టుకోలేనిచో నాలుగు రూపాయలుపందెము"

"నిన్ను నమ్మినదెవరు!"

"అయితే పోనీ - యీనాలుగురూపాయలు నీదగ్గరే యుంచుకో"

(తనివితీర ముద్దు పెట్టుకున్నాడు)

"ఇదేనా నీ పందెము!" అన్నది తుడుచుకుంటూ.

"పిచ్చిపిల్లా ! - నిన్ను ముద్దుపెట్టుకోదలచాను - నీ వందుకు సమ్మతించవని యిలా టోకరా కొట్టించాను - నీముద్దు నాలుగురూపాయలైనా చేయదా"

'లక్ష్మి'

♦ ♦ ♦

"డాక్టరుగారూ!నా కొత్యకాలు చాల బాధకలిగిస్తున్నది"

"కొయ్యకాలేమి బాధకలిగిస్తుందండీ!"

"మీరు నవ్వుటాలనుకుంటున్నారు - మా ఆవిడ నన్నుదాంతోకొట్టి తలమీద ఎంత బొప్పికట్టిందో చూడండి"

'నారపీచు'

♦ ♦ ♦

ఆంధ్ర జానపదగేయ వాఙ్మయం

# కుమార రాముని కథ

(1330 ప్రాంతం)

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

---

ఇదొక జంగం కథ. ♦ 1 అఖ్యాయిక. దీనిలో గేయం, వచనంకూడ ఉన్నాయి. ఈ కథను పాడే టప్పుడు అక్కడక్కడ 'తందానతాన' అనీ, మరి కొన్ని చోట్ల 'మేలు, మేలు' అని ఊత పదాలను చెప్పాలి.

## కర్తృత్వం

ఈపాటకు రాయలసీమలో ప్రచారముంది. దీనిని రచించిన కవిపేరు తెలియదు. ఈకవే రాసిన మరొక జంగం కథ గాంధారి కథ అని వెనకటి విమర్శలో తెలియజేసెను.

కుమార రాముని కథ బళ్ళారి ప్రాంతంలో జరిగింది. కవి ఆ ప్రాంతానికి దగ్గరలో ఉండి, కథాంశాలవల్ల ఉత్తేజంపొంది కథారచన చేసేడని చెప్పవచ్చు. కథ కంపిలి రాజ్యంలో జరిగింది. దాని ప్రక్కనే ఉన్న ఓరుగంటి రాజ్యంలో కవి ఉండేవాడని ఊహించవచ్చు.

జంగం కథలన్నీ సామాన్యంగా ఆ కథాంశాలు జరిగిన కాలంలో రచించబడ్డవే కాని ఆ తర్వాత ఎవరో ఒకరు తీరుబాటుగా కూర్చుని పాత కవితలను పరిశోధించి రచించినవి కావు. ఆ తర్వాత వారికి పూర్వ సంగతులను గురించి అంతశ్రద్ధ సామాన్యంగా పుట్టదు. రాముడు, కృష్ణుడు వంటి దేవ వీరుల సంగతి వేరు. వారు ఎప్పటికీ నూతనులు.

కుమార రాముడు క్రీ. శ. 1320 ప్రాంతంవాడు. 2 * అతని మరణం 1327 ప్రాంతం అని చరిత్ర వల్ల తెలుస్తూంది. ఈ జంగం కథారచన కూడ 1330 ప్రాంతం అని చెప్పుకోవచ్చు.

ఈ పాటలో కొన్ని తురక మాటలు, ఈ రెండు ఇంగ్లీషుమాటలు 3 ‡ తురుపు (Troop), రసీదు (Receipt) కనబడుతున్నాయి. జంగంకథలను పాటగాళ్లు నానాటికి ఆధునికం (Modernize) చేస్తూంటారు. అట్టి యత్నంవల్లే ఇంగ్లీషుమాటలు దొర్లేయి.

ఈ జంగం కథా రచనా కాలం పందొమ్మిదో శతాబ్ది అయుండవచ్చు అని పీఠికా కారులైన వెంకటరమణయ్యగారన్నారు. కాని దానికి ఈ కింది అక్షేపణలున్నాయి. పందొమ్మిదో శతాబ్ద ప్రారంభానికే జంగంకథా రచనా ఫణితిలో కొన్ని మార్పులు బయలుదేరేయి. పూర్వపు జంగం కథా సంప్రదాయాలు సళ్ళేయి. కథలు చిన్నవయేయి. కాని కుమార

---

♦ 1 కుమార రాముని కథను మొదట ప్రకటించిన ఆయన పమ్మి అరుణాచల సెట్టి, మదరాసు. కాని ప్రతులు లభ్యం కావడంలేదు. మదరాసు గవర్నమెంటువారు తమ ఓరియంటల్ సీరీస్‌లో నేలటూరి వేంకట రమణయ్యగారి పీఠికతో ఈ జంగం కథను 1952 లో ప్రచురించేరు. పెద్ద సైజున 80 పుటల గ్రంథం.

2 * Dr N. Venkataramanayya's Kampili and Vizianagara.

3 ‡ కుంభిణి అను పదం కంపెని (Company) అను ఇంగ్లీషు మాటనుంచి వచ్చి ఉండవచ్చునని కొందరు తలుస్తున్నారు. కంపిలి పదం యొక్క అభాసరూపం కావచ్చని నేలటూరి వెంకటరమణయ్యగారు జంగం కథా పీఠికలో XIV పుటలో రాసేరు. కాని కుంభిని అంటే అర్థమేమిటో గాంధారికథా విమర్శలో నేను తెలియజేసేను. కుంభిని కోట అంటే నేలకోట అని అర్థం. దానికి సంబంధించిన మాట ఇది.

రాముని కథ ఆవిధంగా లేదు. దీనిలో జంగం కథా లక్షణాలన్నీ చక్కగా పాటించబడ్డాయి. ఎట్లంటే —కుంభిణీ రాజుకి సంతానం లేదు. భార్య అరియాల దేవి తపస్సు చేయగా సంతానం కలిగింది. ఆమె పుత్రుడైన కుమార రాముడు పన్నెండు ఘడియలలో విద్యలన్నీ నేర్చేశాడు! అతను మానవ మాత్రుడు కాడు; చచ్చిపోయిన శెట్టిలను బతికించేడు. జీవితా గుర్రమొకటి ఇట్టి కథలలో తప్పనిసరికదా! దానిని కుమారరాముడు లొంగదీసేడు. నాగంభట్లు సిద్ధమయేడు. సానిఉంది కాని దానిపేరు మలసాని. ఏడు, పన్నెండుసంఖ్యల సంప్రదాయముంది. ఇట్లు ఇన్ని లక్షణాలుండగా ఇది పందొమ్మిదిశతాబ్దిరచన ఎట్లవుతుంది? కథ ఘటనలు జరిగిన కాలమే ఇంచుమించుగా కథా రచనా కాలం. ఇది జంగం కథలలోని ఒక లక్షణం. కాబట్టి ఈ జంగం కథారచన క్రీ. శ. 1330 ప్రాంతమని చెప్పవచ్చు. ఈ సిద్ధాంతానికి బోధగా కనపడే స్వల్పాంశాలు లేకపోక పోలేదు. కుమారరాముడు అతని సోదరుడు చదివిన చదువులో గజేంద్రమోక్షం, రుక్మిణీ కల్యాణంకూడ చేర్చబడ్డాయి. ఇవి బొమ్మెర పోతన భాగవతంలోవి. ఆంధ్ర భాగవతం కుమారరాముని కాలానికి ఒక శతాబ్దం తర్వాతది - అనగా 1430 ప్రాంతంది. కాబట్టి ఈ భాగవత కథలను పాటగాళ్ళు తర్వాత చేర్చినవే! ఆ సందర్భంలోనె కుమారరాముని చదువులో తొమ్మిదో, పదో గడియలలోనిచదువు విడిచిపెట్టబడింది. పన్నెండు గడియల చదువు గాంధారి, బాలనాగమ్మ కథలలో కూడ ఉంది. ఒకదాని నుంచి ఒకటి కొంచెగా మాత్రమే భేదిస్తున్నాయి.

## చరిత్ర

కుమారరాముడు అను పేరుగల వ్యక్తి చారిత్రక పురుషుడా నా కాదా అను విషయాన్ని గురించి నేలటూరి వెంకటరమణయ్యగారు తమ పీఠికలో చర్చించేరు.

కంపిలిరాజ్యమన్నా, ఆనెగొంది రాజ్యమన్నా, ఒకటే. దానికి ఆనెగొంది, కంపిలికూడ ప్రధాన నగరాలె! ఆ రాజ్యం సుమారుగా 1312 నుండి 1327 వరకు, అనగా బహు స్వల్పకాలం మాత్రమే స్వతంత్రంగా ఉండి, నాశనమయింది. దానినిగురించి సమకాలికులైనఇద్దరు మహమ్మదీయరచయితలు 4† కొద్దిగా రచించేరు. వారివరంటె. (1) ఇబ్నుబత్తూతా; ఇతను 1333లో హిందూదేశానికి వచ్చేడు, (2) ఈసామి అనువతడొకడు కన్నడ గ్రంథాలు5లో కుమార రాముని చరిత్ర కనబడుతూంది. ఎట్లంటే (1) గంగయ్య రచించిన కుమారరాముని చరితె (2) నంజుండ కవి రచించిన బల్లాలరాయని యుద్ధ లేక పరదారసోదర రామనాథన కథె (3) కంపిలి కైఫీయతు (4) భట్టరు కైఫీయతు వీటిలో చెప్పబడ్డ అంశాలు ఒకదాని నుంచి ఒకటి కొంచెంగా భేదిస్తున్నాయి. అయినా ఆనెగొంది పుట్టుక, వృద్ధి నాశనముకూడ చెప్పబడ్డాయి. పై గ్రంథాలకు తెలుగులోని కుమార రాముని కథకు పోలికలు, భేదాలు ఉన్నాయి. కాని తెలుగు రచనసుంచి చరిత్ర స్పష్టంగా తెలియడంలేదు. కల్పనలకింద పడిపోయింది.

## కంపిలి రాజులు

1313 నుండి 1327 వరకు మాత్రమె జీవించిన కంపిలి రాజ్యాన్ని పాలించిన రాజులు ఇద్దరా లేక ముగ్గురా అనేది ఒక సమస్య. ముమ్మడి సింగన్న కుమారుడైన కంపిలి రాయుడికే కుమారరాముడు అను మారుపేరు ఉండా అనేది మరొక సమస్య. వీటిని చర్చించుదాము.

కర్ణాటక ప్రాంతాన్ని మూడవ బల్లాలరాయుడు (రాజ్యకాలము 1328-43) పరిపాలిస్తూండగా, అతని రాజ్యంయొక్క ఈశాన్యములలో ముమ్మడి సింగయ నాయకుడు దొరవది రాజధానిగా చిన్నరాజ్యాన్ని

4 † Vizianagara-origin of the city and the empire by Dr. N. Venkatramanayya P 91.
5 Kampili and Vizianagara by Dr. N. Venkataramanayya.

స్థాపించుకొన్నాడు. ‡6 దోరవది ఇప్పటి హంపీకి పన్నెండుమైళ్ళ దూరంలో నున్న దరోజి *7 అను గ్రామమే కావచ్చు.

ఈ దోరవది రాజ్యం మహారాష్ట్ర దేశాన్ని పాలిస్తున్న శేవ్య రాజైన రామదేవుని రాజ్యంలోది. సింగయ నాయకుడు కూడ అతని చేతికింది పరిపాలకుడే కాని రామదేవుడు బలహీనుడు కాగా సింగయ నాయకుడు కొంతవరకు స్వతంత్రించేడు. చుట్టుపట్ల చిన్న జమీందారీలను 1820 ప్రాంతాలలో వశపరచుకొన్నాడు. ఇట్లు అతని రాజ్యం క్రీ. శ. 1300 నాటికి బాగా వృద్ధి పొందింది. సింగయ నాయకుని కుమారుడు కంపిలి దేవుడు తండ్రికి బాగా సాయపడ్డాడు. క్రీ. శ. 1303 లోని శాసనంలో ఇతని పేరు కనబడుతోంది. సింగయ కంపిలి దేవులు రామదేవునితో సఖ్యంగానె ఉండేవారు. కంపిలి దేవ లేక కంపిలిరాయను గురించి మహమ్మదీయ చరిత్రకారులు లిఖించేరు.

శేవ్య (మహారాష్ట్ర) రాజ్యం విచ్ఛిన్నమవుతూండగా సింగయ కంపిలదేవులు మరికొంత రాజ్యాన్ని సంపాదించుకొన్నారు. దీనికి కంపిలి రాజ్యమను పేరు ఏర్పడింది.

క్రీ. శ. 1313 లో కాబోలు ముమ్మడి సింగయ *8 చనిపోయేడు. ఆ సంవత్సరమె రామదేవుడుకూడ చనిపోయేడు.

కంపిలి రాయడు కంపిలి రాజ్యానికి రాజయేడు. అతని భార్య అరియాలదేవి. అతని కుమారుడు కుమార రాముడు. కుమారుడుకూడ ప్రసిద్ధి పొందేడు.

కంపిలి రాజ్యాభివృద్ధిని చూసి కర్ణాటరాజైన మూడవభల్లాలుడు భయపడి దాని విజృంభణను అణగగొట్టదలచి 1320 లోను, 1322 లోను దాడి వెడలేడు. కాని ఆశించిన ఫలంమాత్రం పొందలేదు.

కంపిలిరాయడికి, కుమారరాముడు, అతని సోదర తుల్యుడైన పోలిక రాముడుకూడ యుద్ధాలలో చాల సాయపడ్డారు.

ఢిల్లీసుల్తాన్ అయిన మహమ్మద్ బిన్ తోగ్లక్ యొక్క మేనల్లుడైన బహాఉద్దీన్ గుర్షాస్ప్, ఢిల్లీ సుల్తాన్ మీద తిరగబడి, యుద్ధంలో ఓడిపోయి, కంపిలిరాయని క్రీ. శ. 1327లో శరణుజొచ్చాడు. ఢిల్లీ సుల్తాన్ ఖ్వాజాజహాన్ అను సేనానాయకుణ్ణి కంపిలిమీదికి పంపించేడు. కంపిలిరాయులు రెండు సార్లు యుద్ధం చేసేడు, ఓడిపోయేడు. అతను, మరి కొందరు మరణించేరు. అతని పుత్రులను పదకొండుగురిని హరిహరుడు, బుక్కన్న మొదలైనవారిని ఢిల్లీ సుల్తాన్ పట్టుకుపోయేడు, కంపిలిరాజ్యం ఢిల్లీలో కలిసిపోయింది.

కంపిలిరాయుని కుమారుడైన కుమారరాముడు, అతని సోదరతుల్యుడైన పోలిక రాముడు (ఇతనికి కన్నడ రచనలలో కాటన్న అని పేరు) ఆ యుద్ధంలోనే మరణించేరు. కుమారరాముడు, పోలిక రాముడు గొప్ప జానపద వీరులుగా ప్రసిద్ధిపొందేరు. వీరిని గురించి తెలుగులో కుమారరాముని కథ, కన్నడంలో కుమారరాముని చరితె, పరదార్ సోదర రామనాథుని కథ బయలుదేరాయి.

పసితనంలోనె ప్రసిద్ధి వహించడంబట్టి కుమార రాముడను పేరు వచ్చింది. బాల్యంలోనే ప్రసిద్ధి చెందిన జానపద వీరులు చాలమందున్నారు. బాలవద్దిరాజు, బాలచంద్రుడు మొదలైనవారు, కుమార రామునికి సమీపకాలంలోనె ప్రసిద్ధిచెందిన బాల వీరులున్నారు. తెలంగాణాలో పరిపాలన చేసిన రేచెర్ల పద్మనాయకులలో తన పదమూడో ఏటే ప్రసిద్ధి చెందిన తను కుమారలింగమనీడు, ఆ వంశంలోనె రేచెర్ల అనపోతానేని మనుమడు, కుమార అనపోతా

6 ‡ Vizianagara - origin of the city and empire by Dr. N. Venkataramanayya P 82.

7 * — — I bid — P 167 - 168.

8 * The early Muslim Expansions in South India by Dr. N. Venkataramanayya P 143.

నేని మనుమడు, కుమార అనపోతానేడు అని పేరు పొందాడు.

కుమారరాముణ్ణి గురించి సమకాలిక శాసనాలు లేవు. అతను తండ్రిచాటున ఉన్నవాడు. ఇతని ప్రసిద్ధి నూరేళ్ళ తర్వాత వేయబడిన 1407, 14[illegible]0 నాటి శాసనాలలో * చెప్పబడింది.

ఇతనికి రాముడు అను పేరు ఎట్లు వచ్చింది? శ్రీరాములవారి వరంవల్ల జన్మించినందువల్ల రాముడను పేరు వచ్చిందని జంగం కథనుంచి తెలుస్తూంది.

ఒక చారిత్రక పురుషునిగురించి రచించబడ్డ తెలుగు జంగంకథలో యదార్థ చరిత్రాంశాలు చాలా ఉంటాయని మనం తలుస్తాము, కాని జంగంకథలలో ఉండే ఒక గొప్ప లోపమిదే. వీటిలో యదార్థచిత్రణగాక ఆదర్శీకరణం (Idealization) చాలా వుంటుంది. కాబట్టి ఇవి చరిత్రకు అధికంగా పనికిరాకపోయినా, వాఙ్మయపు విలువను గణించుకొన్నాయి.

## కల్పన

ఈ జంగం కథ తక్కినవాటిలాగుగాక ఒక కొత్త తోవ తొక్కింది. అతి దుర్మార్గుడైన పోలికరాముడు అను ఒక కొత్త పాత్ర సృష్టింపబడ్డాడు. ఇట్టి పాత్రల దుర్మార్గాన్ని, తెలివితేటలను చూసి పాఠకులు మెచ్చుకోరు. కాని ఆశ్చర్యపోతారు. ఇరవైయో శతాబ్దంలో ఇటువంటి ప్రధానవ్యక్తులుగల సినిమాలు బోలెడన్ని. అవారా అను హిందీఫిల్ము, సైకిల్ దొంగ అను ఇటలీ ఫిల్ము ఇట్టివే! ఇట్లు ఆ కథాకల్పన నవీనకథా కల్పనలతో తులతూగుతూంది.

కల్పనలలో ఒక విశేషం కనబడుతూంది. రాముడి, పోలికరాముడి పాత్రలలో కృష్ణుడి, బలరాముడి అనుకరణ కొంతవరకు ఉంది. పసితనంలో 'బాల్య క్రీడ'లకు సమంగా కొన్ని తుంటరిపనులు వర్ణించడ్డాయి. రామకృష్ణులు చాణూరుడు, ముష్టికుడు అను మల్లులను సంహరించేరు. పోలికరాముడు కొందరు జట్టీలను వధించేడు. కువలయపీడు అను పేరుగల ఏనుగును కృష్ణుడు హతమార్చేడు. అట్లే కుమారరాముడుకూడ ఒక ఏనుగును నాశనంచేశాడు. ఇట్లు కొన్నిపనులు రామకృష్ణుల బాల్యక్రీడలచహూరా మీద ఉన్నాయి. దీనికేదైనా కారణముందా? 1100 ప్రాంతంలో రామానుజాచార్యులు వైష్ణవ మతాన్ని స్థాపించేడు. విష్ణువు చరిత్రను తెలియజేసే భాగవతంమీద ప్రజలకు మోజు కుదిరింది. 1327 ప్రాంతాలకుగాని తెలుగు భాగవతం పుట్టలేదు. పురాణంగా చెప్పబడుతూండే సంస్కృత భాగవతమే ఇట్టి కల్పనలకు ఆధారమయిందని చెప్పవచ్చు.

## ఇది సుఖాంత కథ

జంగంకథలు ఏ మాదిరిగా ఉంటాయో ఇదీ అదే విధంగా ఉంది. కుమారరాముడు, పోలికరాముడు నశించేరు. కాని ఢిల్లీసుల్తాన్ వారి శౌర్యాన్ని మెచ్చుకొని గెల్చుకొన్న రాజ్యాన్ని తిరిగి కుంభిణీ రాజుకి ఇచ్చివేసేడు. ఇట్లు ఇది సుఖాంతంగా పరిణమించింది.

## ఇతర అంశాలు

పోలికరాముడి పోకిరీతనాన్ని వీరకుంభిణి రాజా ఎప్పుడూ మెచ్చుకోలేదు. కాని కుమారరాముడు ఎంతైనా సహిస్తూవచ్చేడు. అది అతనిలోని ఒక దోషమని చెప్పక తప్పదు.

సంఖ్యల విషయంలో ముప్పైమూడు సంఖ్య ప్రాముఖ్యత పొందింది. ఈ కథలో రసాలు చక్కగా పోషింపబడ్డాయి.

ఈ పాటలో అనేక ఉర్దూపదాలున్నాయి. బళ్ళారి ప్రాంతపు భాషలో ఉర్దూపదాలు అధికం. అదెట్లున్నా దీనిని పాడుతూవచ్చిన జంగాలు స్వతంత్రించి దీనిభాషను ఆధునికం (Modernize) చేస్తూవచ్చేరు. అందువల్లే ఇంగ్లీషు మాటలుకూడ చేరేయి. ఉర్దూపదాలకు పుస్తకంచివర టీక ఉంది.

---

9 * నెలటూరి వెంకటరమణయ్యగారి కుమారరాముని కథకి ఉపోద్ఘాతం పుట xxiii.

దీని లక్షణం చిత్రంగా ఉంది. అంతా చిన్న చిన్న చరణాలు. ఆరుమరాటీల కథకూడ చిన్న చిన్న చరణాలే! భాష బహు సులభం. పున్యాముక్క-దీనితో అన్నదమ్ముల ప్రకరణం ప్రారంభమౌతుంది.

ఆ రోజున చిన్నవాండ్లకు
అన్నముకూడ పుట్టింది
అట్లా ఏడాదిగడచెను
రెండవ ఏడు వచ్చెను ||౮౦||

తప్పటి అడుగులు బెట్టుచు
రెండేళ్లు వెళ్లెను
మూడవఏడు వచ్చెను
దూముదాముగా నడచెదరు
మాటలు బాగుగ వచ్చెను ||౯౦||

# ★ ఆంధ్ర నవలలు ★

శ్రీమతి ఎం. లక్ష్మీదేవి



నవల యనునది యొక కావ్యవిశేషము. ఆంధ్రమందువలె నాంగ్లమందును నవలల వ్యుత్పత్తిని గూర్చి మతభేదములు కలవు. కొందరు దీనిని యాంగ్లేయులు ఇతరుల నుండి గ్రహించిరందురు. మఱి కొందరించుక రూపభేదమున నిట్టి కావ్యములు మొదటినుండియు నాంగ్లమున నుండెనందురు. ఆంధ్ర విమర్శకుల యందును నిట్టి మతభేదములే కలవు. పరిణామవాదులు నవలల నాఖ్యాయికల నుండియు, ప్రబంధములనుండియు సంతతి క్రమము నేర్పరుప జూతురు. అనువాదకులు ఇట్టి కావ్యవిశేషము లాంగ్లము నుండి యాంధ్రమునకు దిగినవందురు. భాషాసాహిత్య తత్త్వమును సూక్ష్మ దృష్టిని చూచినవారు పరిణామ క్రమమున కనువాదము నంగముగా జేర్చి మతభేదముల సమన్వయింతురు. ఏ సాహిత్యమునందైనను కేవల మపూర్వములగు గ్రంథములు పుట్టుట యసంభవము. అపూర్వములనబడు తత్త్వ మరసినచో నందు పూర్వుల జాడలు కనబడక మానవు.

నవలలకు ముఖ్యాంశములు: 1. కథన కౌశలము 2. వివిధవస్తు సమ్మేళనము. 3. పాత్రనిరూపణము. 4. పరికరము 5. చతుర సంభాషణము (5)తత్త్వ విచారము.

ఇవి యన్నియుగాని, వీనిలో గొన్నిగాని యౌచిత్యానుసారముగను, హృదయాకర్షకముగను, జేర్చి రచన సాగింపవలెనన్న గవితాపటిమ గలుగవలయును. ఇట్టి రచనలకుఁ బద్యగద్యాత్మకమగు రూపభేదముతో నంతగా వివాదము లేదు. తాత్కాలిక ప్రోత్సాహమూలమున వీనికి బద్యరూపమో, గద్యరూపమో గలిగినను శాశ్వతత్త్వము మాత్రము రూపభేదముచే గాకఁ గావ్యగుణములచే గల్గుచున్నది,

నవలలిరు తెఱగులు – యథార్థ్యసూచకములు, ఆశయోద్దీపితములు, అటని ఈ భేద మవిలంఘ్యముకాదు. మతమేమనిన ఒక తెఱగు నవలయందొక కొన్ని గుణములకుఁ బ్రాముఖ్యము, వేఱొక తెఱగు నవలలయందు మఱికొన్ని గుణములకుఁ బ్రాముఖ్యము. అట్టి భేదములు కావ్యవిశేషములకు సామాన్యములు. అంతే కాదు, సాహిత్యములకు కొన్ని యుగములందు యాథార్థ్య సూచకత్వమును, మఱి కొన్నిటికి ఆశయోద్దీపితత్వమును గుణములు కావచ్చును. ఇట్టి భేదములు సాహి

త్యకారకులగు కవిబ్రహ్మల మనస్తత్వము లందలి భేదముల ననుసరించును. కొందరి బుద్ధికీ జగన్నాటక మంతయు గ్రుడ్డివారి తగవులాటవలెం దోచి హాస్యాస్పదమును నిరుత్సాహముగను నగును. మరికొందరికి లోకవ్యవహారమందలి సంతోషదాయక ములగు భాగములో హృదయాకర్షకములై ప్రపంచము నెడల వారి మనోవృత్తులనుబురి గొల్పును. ఇంకను కొందరికి సంసారాం బుధియందలి లోతుపాతులు చక్కగాంగని పెట్టి లోకయాత్రను పరమేశ్వరుని సాన్ని ధ్యమునకు నిరాటంకముగను, నిర్భయము గను సాగించుటకు మార్గములు స్ఫురించును. కవులకు గల ఇట్టిభేదములు వారి రచనలయందు కనబడక తప్పవు.

కొందరి రచనలాశయోద్దీపితము లయ్యును, యాథార్థ్య బోధకములగును. మఱికొందరి రచనలు యథార్థ వర్ణనల య్యును ఆశయోద్దీపితములగును. ఆంగ్ల కవి వర్యుడగు బన్యను రచించిన పిల్గ్రిమ్సు ప్రోగ్రెస్ అను గ్రంథమాశయోద్దీపిత మయ్యును యదార్థ బోధకత్వమునకుం బేరెన్నిక గాంచినది. ఆంగ్లమందంతకు ముందు ఆశయోద్దీపనమే కావ్యములందుం బ్రధానగుణమైయుండెను. ఆంధ్ర మందు శ్రీ వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రమునకు మునుపటి గ్రంథములందాశ యోద్దీపనమే ముఖ్యమైయుండెను. రాజశేఖర చరిత్ర మాశయోద్దీపితమైనను యథార్థ బోధనముచే విశిష్టమగుచున్నది. ఇట్లు వివిధ గుణవిశిష్టములగు గద్య గ్రంథ ములాంధ్రమున కొంతవర కాంగ్లసాహిత్య ప్రోత్సాహవశమున గలిగియుండుటచే నాంగ్ల నవలా చరిత్రము నించుక వివరింపవలసి యున్నది.

బన్యనుకవికి పూర్వమందున్న సాహిత్యమును విమర్శించుటకు మూడు యుగ ములుగా నేర్పరుప వచ్చును. ఆదియుగము, మధ్యయుగము, పునర్జీవనయుగము. ఆది యుగమునాటి గ్రంథము లాంగ్లులు క్రైస్తవ మతము నవలంబింపక ముందు జేసిన వీర వ్యాపారములను గీర్తించును. మధ్యయుగ మందలి యాంగ్ల సాహిత్యమున మతము, క్షాత్రము, శృంగారమును వర్ణితములు. పునరుజ్జీవన యుగమందలి గ్రంథములందు గ్రీకు, రోమన్, ఇటలీ సాహిత్యముల యను కరణములు మెండు. ఈయుగత్రయమున నాంగ్లమానవ జీవిత మాయాకాలము లందు విశ్వజనీనములై యుండిన యాశ యముల ననుసరించుచు వచ్చెను. నాయికా నాయకుల వర్తనములును, శీల వర్ణనము లును, ఈ తీరున నుండవలెనని సిద్ధాంతము లేర్పడి యుండెను. ఆయాయుగములందలి కాలమానస్థితులను బట్టియుం బ్రజల యభి రుచులను బట్టియు, గవులు ఆశయోద్దీపిత ముతో, యదార్థముతో ఎట్లైనను హృద్య ములగు కావ్యముల రచించియుండిరి.

ఎట్టి యుగత్రయము సమున్నద మునప కార్యులకు సాంస్కృతిక విజ్ఞానప్రదానము చేయుటకుం బ్రసిద్ధ మార్గములాయెనో అట్లే యాంధ్రసాహిత్యము ప్రత్యేక సాహిత్యముగా నేర్పడిననాడు గీర్వాణ భాషయందలి విజ్ఞానము నాంధ్రములోనికి దింపవలసిన యవసర మేర్పడియుం డెను. నన్నయకు పూర్వమాంధ్రమునం బేర్కొనదగిన ప్రసిద్ధ కథాంశములుగల కావ్యము లాంధ్రమున లేవనియు, అట్టి కావ్యములు లేనినాడు జనులయందంతగా విజ్ఞాన వ్యాప్తికవకాశముండి యుండద నియుం జెప్పవచ్చును. అయితే నన్నయకు పూర్వము ఆంధ్రదేశమంత గొడ్డుపోయి యున్నదనుట యసంభవము. క్రీ.శ 1వ శతాబ్దమునకు ముందునుండియు యాంధ్ర కళింగ రాజ్యములందు సాహిత్య ప్రచా రము కలిగియే యుండెననుటకా కాలము నండి దేశములలోనుండిన బౌద్ధవిహారములే సాక్షి. అయితే నన్నయ తరువాతి కవీ శ్వరుల మతమునకు సాహిత్య ప్రచారమం తయు వేదబాహ్యమని యెంచబడెను. ఈ గాథలు బౌద్ధజాతక కథలై యుండవచ్చును. అట్టివ్రాతలు కేవలము మతావేశ బోధిత ములై యుండవచ్చును. నన్నయ ప్రభృ తుల కాలమున కావ్యరచనా కౌశలము వేదవిద్యా ప్రచారమునకు సైదోడయ్యెన నుట నిర్వివాదాంశము.

వేదవిద్యా ప్రచార ప్రాముఖ్యమున కంగ ములవదగు సంస్కృతకావ్యములు రాజ్య మందలి యితివృత్తము లాంధ్రకవులకు కావ్యవస్తువులైనవి. అప్పటి యాంధ్రులు మేధావంతులై తమ కనువైన భాషలయం దెల్ల కౌశలము సంపాదించి వివిధ సాహిత్య మార్గములెరిగి యాంధ్రకావ్య రచనమును ప్రోత్సహించిరి. ఆనాటి సాహిత్యాభి రుచులకును, విజ్ఞాన ప్రచారమునకును సాయపడు ఆంధ్రకవులు ప్రసిద్ధకథలను, మిశ్రకథలనుం గావ్యవస్తువులుగా గ్రహిం చిరి. రానురాను గావ్య కల్పనమున నాది యుగముననే పురాణ మార్గమును ప్రబంధ మార్గమును విశిష్టములాయెను. ఇతి వృత్త మునందును, రసవిశేషయ ప్రాధాన్యమునం దును ఈ మార్గద్వయమునకు భేదము కలదు. పురాణముల ఇతివృత్తము ప్రసిద్ధ కథా సమ్మేళనము. ప్రబంధముల ఇతి వృత్తము మిశ్రమకథాసమ్మేళనము. పురా ణములందు సంభవములును, కథాసరళియు బోధమును ముఖ్యములు. ప్రబంధములందు రస ప్రాధాన్యము విశేషాంశము, అయినను ఆంధ్రకవితా పితామహుడని పేరందిన అల్లసాని పెద్దన రచించిన మను చరిత్రయే యాంధ్రమున మొదటి ప్రబంధమనియు, శ్రీ వీరేశలింగ కవి కృతమగు రాజశేఖర చరిత్రమాంధ్రమున మొదటినవలయనియు చెప్పబడుచున్నది. ఆంధ్ర మందాంగ్లము వలె సాహిత్యాంతరములనుండియు గ్రహిం చిన సామగ్రితోను పరికర విశేషముల

తోను కవిపుంగవులు హృద్యములును బోధ్యములును నగు ప్రబంధములఁ జెప్పిరి.

గత శతాబ్దమునందు క్రొత్తగా బుట్టిన తెలుగునవలలు మూఁడు తెఱగులు. (1) ఆంగ్లనవలలననుకరణములు. (2) గద్యప్రబంధములు. (3) సంకరములు. ఈనవయుగమునందలి నవలలకుఁగూడ నిట్టి జాతివిభాగము చేయవచ్చును. అవిరతపరంపరలై పెరుగుచున్న ఈ నవలలో నిక నొక యర్ధశతాబ్దమున కేవినిలుచునో యేవి విస్మృతములగునో చెప్పుట కష్టము. కాని రాజశేఖర చరిత్ర హేమలత యను నవలలు వివిధములగు రెండు మార్గములనంటియున్నవి. రాజశేఖర చరిత్రమువలె లోకయాత్రావిధానమును, విచారించి యాశయములను జూపనెంచు నవలా విశేషమాంధ్రమున నాటుకొనలేదు. రచయితలకు సర్వసాధారణముగా నచ్చినది హేమలత జూపిన మార్గము. ఇది గద్యప్రబంధమార్గము.

ఆంధ్రమందు గల పూర్వపు ప్రబంధములలో నాయకానాయకుల యనురాగ పరిపాకము కథాంశమై ధీరవర్తనముల సల్పిన కృతిభర్తల వంశానువర్తనములును, నభ్యుదయములును, రసోద్దీపనములగు వృత్తములును నమరియున్నవి. హేమలతవంటి గద్య ప్రబంధములందు దురితముల నెదిరించి వీరవ్యాపారములు సల్పిన ప్రసిద్ధ పురుషుల చర్యలు క్రుత్రిమమగు నొకశృంగార కథాంశమున కుద్దీపనములగుచున్నవి.

ప్రపంచయాత్రా తత్త్వ విచారము వ్యంగ్యముగా నవలలకు గుణభంగురత్వమును దాత్కాలిక రంజకత్వమును గల్పించుచున్నది. ఆంధ్రనవల యిట్టి దశనుండి బయటపడి యాంధ్రసాహిత్య చరిత్రమున గౌరవస్థానము పొందవలెనన్న నాంధ్రీయ సమన్వయముల జీవితమునందు సూచింపగల నవలలు కావలయును. ఆంధ్రనవలా రచయితలు ట్టి లోపమును దీర్చి యాంధ్ర సాహిత్యమును బెంపొందింప ప్రయత్నింతురుగాక.

# "రాగవర్ధని"

'విజయ - రాఘవ'

"అదేమిటి!"

"ఏమిటది!"

"ఏమిటేమిటి! నాతలకాయ యింకా మీకు తెలియలా!"

"ఏమిటే తెలిసేది!"

"ఏమిటో తెలియకుండానే వుందా యిన్నాళ్ళబట్టి! అవున్లెండి. 'తెలిసింది' అంటే పూసగుచ్చినట్లు చెప్పమంటారని, ఒక్క మాటలో తెలియదు అంటే పోతుందిగదా అని వూరుకొన్నారు. అంతేనా!"

"అబ్బబ్బ! వూరికే విసిగించకు. విషయంయేమిటో తేల్చి చెప్పక, యెందుకు దాస్తావ్"

"నిజంగా చెప్పండి! మీరు వినలేదూ!"

"ఏమిటే వినేది?"

"అదేనండీ!"

"అదుగో మళ్లీ అదే మాటంటావ్. ప్రతిదీ నానబెట్టటం నేర్చావుగదా!"

"అదైనా, నాకు మాత్రం యెలా తెలిసిందంటే మొన్న సుబ్బులు యేదో పనుండి యిటువైపుకి వచ్చాట్ట. మళ్లా యింటికిపోతూ - పోతూ చూసి వెళ్దామని, మనింటికొచ్చాడు."

"ఏమిటిరా కబుర్లూ? " అన్నా.

"ఏముంటయి అక్కాయ్ ......" అంటూ కళ్ళనీళ్లెట్టుకున్నాడు. వాడికళ్లెంట నీళ్ళొచ్చేసరికి, నాకూ వచ్చాయి సుమా!

"అదేమిటే పిచ్చిదానా! అలాయేడుస్తావ్..."

పిచ్చిదాన్నయ్యాను నిజంగా ఆమాట వినేటప్పటికి. జేబురుమాల అడ్డంపెట్టుకొని వెక్కి వెక్కి యేడ్వడం మొదలుపెట్టేశాడు. వాడేంచెబుతాడో అని నాగుండె ఆదుర్దాపడటం యెక్కువయింది "ఏమిటిరా అసలు విషయం" అని అడగబోతుండగా వాడే కళ్లుతుడుచుకుంటూ —

"అన్నయ్య వేరుపడ్డాడు" — అన్నాడు.

ఆ మాట వినేటప్పటికి మెరుపు మెరిసినట్లు నా రెండు కళ్లూ పోయినట్లనిపించింది. "ఎందుకని?" అని అడిగాను.

"ఏదో మాటామాటా వచ్చిందట—" అన్నాడు

"నీకు తెలియదా" అన్నా

"ఎవరనడిగినా" యింట్లో చెప్పలేదు అన్నాడు.

"అన్నం యెక్కడ తింటున్నాడన్నా"

"హోటల్లో...! " అన్నాడు.

"ఉండటం...! అన్నా

"మన యింటికి వెనకాల డాబాలో" అన్నాడు. తర్వాత నేనేం అడిగానో, గుర్తులేదు. వాడేదో కబుర్లుకూడా చెప్పుకొచ్చాడు. యిక నేను వినలేకపోయాను. యేది చెప్పినా ఒకవేళ 'సరే' అనిగాని, "ఊ"... అనిగాని, అంటానికి శక్తిలేకుండాపోయింది.

"వెళ్లొస్తా..." అంటూ కాసేపుండి సైకిలెక్కి వెళ్లిపోయాడు.

"మీకెక్కడైనా కనిపిస్తున్నాడా మా అన్నయ్య!"—

"కనిపించకేం ... రోజుకి ఒకసారైనా కనిపించక తప్పదు."

"నీకేం పల్కరించడంలా"

"రోజూ పల్కరించడానికి గొంతు కలుగుతుంది. యిప్పటికి మూడునాల్గు రోజుల క్రితం ఆ కూల్ డ్రింక్ షాపుయందు కనిపిస్తే -

"అంతా మరచిపోయేరా?" అంటే - తెలుసు కాదు. అంతే.

"వాడొక్కడేవున్నాడా! యింకా యెవరైనా వున్నారా!"

"ప్రక్కన యెవరో ఒకతను పొడుగ్గా యెర్రగా వున్నాడు. యింకా యిద్దరు యించుమించుగా వాడెత్తేవున్నారు. —"

"మీరు ఏ సైకిలు దిగకుండానో పల్కరించి వుంటారు అంతేనా? "

"అదైనా, ఆఫీసునుంచి వస్తుంటే కనిపించాడు కాబట్టి ఆ కాస్తయినా పల్కరించా. లేకపోతే ..."

"అదేమిటండీ! కాస్తదిగివెళ్లి పల్కరిస్తే తప్పేముంది? అసలెందుకు వేరుగావుంటున్నాడో తెలిసేదిగా!"

"ఏమిటీ మరీ పిచ్చిదాన్లాగా మాట్లాడుతున్నావ్! వాడు వేరుగా వుంటున్నాడని నేనేమైనా కలగన్నానా? అయినా అంతమందిలో యువతలకు పిల్చి-అడిగినా - యీ విషయం యీ కాస్తయినా చెప్పతాడని నమ్మకం యేమిటి?

"అదేమిటీ! మరీ అంటారు మీరడిగితే తప్పకుండా చెబుతాడు. చెప్పకుండా యెప్పటికీ తప్పదు."

"అని యేమిటి ధైర్యం? "

"ధైర్యం కాదండీ! మీరు మరీను! మీరంటే వాడికి గౌరవముండాలి, తెలుసా!"

"ఉంటేనే..."

"కాబట్టి..."

"అడక్కుంటావ్"

"మీయిష్టం..."

"అటువంటప్పుడు, బజారులో కలుసుకున్నప్పుడు యీ విషయం యెత్తడం కంటే, ఒక సారి వాన్నే మనింటికి రమ్మంటే వస్తాడుగా — అప్పుడు యెవరైనా అడగొచ్చు... ఏమంటావ్"?

"ఏముసేదేముంది. అలాగే రమ్మన్నానని చెప్పండి,"

"నువ్వురమ్మంటేనే వస్తాడన్నమాట. నేరమ్మంటే రాడా"?

"అబ్బ! పోనీ, మీరేరమ్మన్నారని చెప్పకోండి. యీమాత్రం దానికి వంతులెందుకు? యెవరు చెప్పారనుకున్నా, వాడుగావాలికదా! రేపు తప్పకుండా చెప్పండి ... మరిచిపోరుగదా!"—అని భువనేశ్వరి అంటూంటే, దూరదూరమవుతున్నకొద్దీ మరీమరీ విని పించేమాటలు అస్పష్టంగా వుండటంవల్ల ఆనంద్ మోహన్ సైకిలు ఆ వీధి మలుపులోకి వెళ్లిపోయింది. ప్రతిరోజూ ఆనంద్ మోహన్ ఆఫీసుకు వెళ్ళగానే భువనేశ్వరి యేదో అల్లికలల్లుకొంటూనో, క్రొత్త క్రొత్త ముగ్గులు నేర్చుకొంటూనో, చక్కని మంగళ హారతి పాటలు పాడుకొంటూనో, మొత్తానికి యేదో యిటువంటి పన్లో, లేక యింటిపన్లో చేసుకొంటూం డేది. ఎదురింటి సువర్చల రోజూ రావడం జరుగు తూంటుంది. ప్రొద్దు పోవడానికి మాటలు చెప్పు కొంటూ పనులెవరివివారు, అవసరపడితే ఒకొరి కొకరు సాయపడుతూండేవారు. అత్తింటివార్ని, పుట్టింటి వారిని గురించికూడా యిద్దరూ చెప్పుకొం టూండేవారు.

ఆనాడు ఆనంద్ మోహన్ వెళ్ళిన అరగంటకు సువర్చల తలదిండు గలీబా, మీద రెండు నెమలి బొమ్మలు అల్లుదామని రంగురంగుల దారపు కండెలు, సూది, మొదలైన సరికరాలతో భువనేశ్వరి దగ్గరికి వచ్చింది. కళకళలాడుతూ గృహలక్ష్మిలాగా కని పించే భువనేశ్వరి, నలిగి, మాసిన చీర కట్టుకొని, నొసటను చెరిగిన కుంకుమ తిలకం రెండు కనుబొమల మధ్యా, వాడిపోయిన వదనంతో, దీనంగా కనిపించే దరికి సువర్చలకు యేమని పలకరించాలో అర్థం కాలేదు. ఒక్కయిదు నిముషాలాగి—

"భువనా" ! అంది మెల్లగా.

వంటవసారాలో తలుపు ప్రక్కగా యేదో ఆలోచిస్తున్న భువనేశ్వరి ఉలిక్కిపడి ఆలోచనల తెరలనుండి బయటపడి, పమిటి చెంగుతో మొగంతుడుచుకుంటూ-

"ఊ...యేమిటే !"అంది.

"అలావున్నావేం? "

"ఏంలేదు."

"ఏంలేదంటావేం. ఎందుకో బాధపడు తున్నావ్. యేంలేకపోతే యెందుకిలావున్నావ్ యేదోవుంది. చెప్పవుటే ! భువనా"

"ఏంచెప్పనే. అంతా అయోమయంగావుంది యేంతోచడంలా.—

కార్తీక పౌర్ణమినాటి రాత్రి పుట్టాడుకదా అని తొమ్మిది సంవత్సరాలక్రిందట చనిపోయిన మా తాతయ్య, మా అన్నయ్యకి "రజనీకాంతుడు" అని పేరుపెట్టాడు. వాడు పుట్టినదగ్గరనుంచీ, మా తాతయ్యకు ప్రతివిషయంలోను లాభం కనిపించడం జరుగుతోందని పరిచయమైన వాళ్లందరితోను చెప్పకునేవాడు. మా తాతయ్య మహాకవి, పండితుడు, హరికథలుచెప్పేవాడు, మద్దెలవాయించేవాడు. ఆయన యేసభకు వెళ్లినా వాన్ని వెంట తీసుకొని వెడుతూండేవాడు. వాడంటే ఆయనకు ప్రాణం; దానికన్నా కూడా తియ్యగా చూసుకునేవాడు. వాడి చిన్నతనంలో మా తాతయ్యే బాయిలర్ వేసి, నీళ్ళు కాగేంతవరకూ దగ్గర కూర్చొని మంట వేసి, బాగా కాగనిచ్చి, వేడి నీళ్లు-చన్నీళ్లు సమపాళంగా తానే స్వయంగా చేసి, ఆ పని జరిగినంత సేపూ గాలి తగిలితే కోల్డు రాగలదో ఆలోచించి మరీ పోయనిచ్చేవాడు. ప్రతిరోజూ స్నానమైన తరువాత, వెంటనే సాంబ్రాణి పొగ వేసి, పౌడరద్ది, యిస్త్రీ బట్టలు తొడిగి, ఆయన షికారుకు వెళ్ళబోయేముందు చంక కందివ్వాలి. అలా జరగని రోజున ఆయన ఎక్కడిలేని కోపంవచ్చి యింటిల్లపాదిని ఛడామడా తిట్టిపోసేవాడు. యింత కష్టపడి గారాబంగా పెంచినందుక మా తాతయ్య గుణాల్లో "కవిత్వం" అనేది అబ్బిందని మా నాన్నగారు అంటూండగా నేను రెండుమూడుసార్లువిన్నాను. తరువాత మా పెద్ద, చిన్న తాతయ్యలు — మా అమ్మమ్మలు— బామ్మలు అంటూండగాకూడా విన్నాను. వాడు వ్రాసినవికూడా విన్నా. చదివానుకూడా. బాగానే వున్నట్లు తోచాయి. నేనే ఒకసారి వూరుకోక "అదేంకథరా అన్నాయ్" అన్నా ఒక కథ చదివి. "అది అంతేలే...!" అన్నాడు. "అదేమిటిరా ?" అని అడగబోతూండగా యేదో చెప్పడం మొదలెట్టాడు. కాని నాకేంఅర్థంకాలేదు. మా అన్నయ్యకు కవిత్వం అబ్బడంలోనూ, మా నాన్నకు మృదంగం అబ్బడంలోనూ, మా తాతయ్య మా యింట్లో యింకా సజీవుడై వున్నాడనే అనుకొంటాం. భౌతికంగా మనిషి కనిపించక పోతున్నాడుగాని, అంతర్యంలో ఆయన పవిత్ర ప్రతిమ ప్రతిబింబిస్తూనే వుంటుంది. ఒక్క మా యింట్లోనేకాదు. అందరి బంధువుల యిండ్లలోనూ ఆదరణీయుడే. ఆయన రచించిన 'వేణుగోపాల శతకం' పఠించకుండా యెవరూ యేనాడూ వుండలేరు. నిజంగా మా అన్నయ్య బ్రతికినట్టు, వాడికి జరిగినట్లు మేమెవ్వరం తరువాత అనుభవించలేకపోయాం. వాడంటే మా చుట్టాలంతా యెంతో ఆప్యాయంగా చూసుకొంటారు. అయిదో తరం మా వంశానికి వాడే మొదటివాడని, యెంతో గౌరవంగాకూడా చూస్తూంటారు. చమత్కారంగా, నిష్కల్మషంగా మాట్లాడతాడని కబుర్లుచెప్పమని మా

వాళ్ళంతా కొసరి కొసరి పుణికి పుణికి అడుగుతారు. వాడూ మొదలుపెట్టేదంటే అదేదారి. వినుగూ—విరామం లేకుండా చెప్పుకుపోతూంటాడు.

మా అన్నయ్యంటే మా కెంతో భయం. వాడికి కోపం వచ్చిందంటే ఒళ్లూ పై తెలియదు. ఒక వేళ మేమేదన్నా అల్లరిచేస్తే కొడతాడు; తిడతాడు. రాత్రి [illegible] చాలాసేపు [illegible] యేదో రాస్తాడు. ఒక్కొక్కసారి [illegible] కద్దు. వూరికే కాసేపైనాగా వుండేవాడు కాదు. యేదో చదువుతూనో, లేకపోతే యే పూలమొక్కలకు పోషణచేస్తూనో వుండేవాడు. ఒక్కొక్కమారు పొద్దుపోయేదాకా మేల్కొని వ్రాస్తూండేవాడు. అప్పటికి మేం ఒక నిద్రతీసేవాళ్ళం. "పొద్దుపోయింది పడుకోరాదురా" అంటే, అన్న అరగంటకో, గంటకో లేచి వెళ్ళి పడుకునేవాడు. వూరికే వున్నాడనుకుంటూమా! యేదో ఆలోచిస్తూవుంటాడు. నిజంగా వాడే వాడు, వాడిరెక్కలమీద కష్టపడి బ్రతుకుతున్నాడని అందరం అనుకొంటూంటే, చూస్తూ చూస్తూండగానే మా అమ్మ నాన్నని వదలిపెట్టి వేరుగా వుంటున్నాడంటే నాకెంతో బాధగావుంది."

"పెళ్ళయిందా! మీ అన్నయ్యకి?"

"లేదేయింకా! యీ మధ్య మూడు నాల్గు సంబంధాలొచ్చాయి." "ఎలావుందిరా పిల్ల?" అంటే "బాగానేవుంది కాని ..." అని యేమో చెప్పాడు. యిట్లా వచ్చిన సంబంధాలన్నిటికి జవాబు యిలాగే చెప్పాడు. చూసొచ్చినవాళ్లంమాత్రం అనేకరకాలుగా అనుకొంటుంటే, అదంతా వినలేకకాబోలు మా దగ్గర నుంచి లేచి వెళ్ళిపోయేవాడు. ఒకసారి మా మేనత్తగారు "యేరా! రజనీ! చూసినపిల్లలెవ్వరూ నీకు నచ్చకపోతే యింకెవ్వరురా నచ్చేది?" అని అడిగింది. వాడికి యెందుకో నవ్వొచ్చింది ఆ ప్రశ్న అడగంగానే. ఆ నవ్వుకి అర్థం యింతవరకూ నాకేం బోధపడలేదు. వాడికి చిన్నప్పటినుంచీ పట్టుదల మహా యెక్కువ. మా నాన్నతోకూడ ఎక్కువ మాట్లాడేవాడు కాడు. ఏవైనాకావాలంటే మా అమ్మద్వారా ఆయన చెవులకు వినిపించాల్సిందేగాని, వాడు యేమైనా సరే అడిగేవాడు కాదు. అటువంటిది యీనాడెందుకు వాడిలా వేరుగా జీవితాన్ని గడపాలను కొంటున్నాడో నాకేం తెలియటంలేదు. [illegible] వారానికి రెండుమూడుసార్లైనా వస్తూపోతూండేవాడు మా యింటికి; ఈ మధ్య బొత్తిగా రావడమే మానేశాడు. [illegible] "ఏమో! [illegible] రావటంలేదో" అని "యిప్పటికి అక్కడుంటే యెందుకు రావటంలేదో," అని భువనేశ్వరి తన ఆవేదనంతా చెప్పుకు పోతూండగా టేబిల్ మీద గడియారం ఒంటిగంట చూపింది. సువర్చలకు యేమని ఓదార్చాలో పాలుపోక—

"భువనా! ఒంటిగంటయింది యికనైనా లేచి భోంచెయ్యి" అంది

"ఏమోనే! తినబుద్ధికావటంలేదు."

"అదేంటే! యెంగిలి పడకపోతే, వేసంకాలం మరీ వడియంలాగా తయారవుతావ్. లేచి కాస్తతిను. ... ముందు లే ...... నువుస్నానంచేసిరా! నేను వడ్డిస్తాను పోనీ ... !"

సువర్చల బలవంతంమీద భువనేశ్వరి స్నానం చేయడానికి వెళ్ళిపోయింది. నూది దారపుండలు, గలీబాగుడ్డ టేబిల్ మీద పెట్టి వంటయింట్లోకి వెళ్ళి సువర్చల అన్నం వడ్డించడానికి ప్రయత్నం చేయడం మొదలెట్టింది.

సువర్చల - భువనేశ్వరి స్నేహం కృష్ణా తుంగభద్రల కలియకవలె, గంగాయమునల సంగమంవలె యిప్పటికి రెండుసంవత్సరాలనుంచి మేళవించబడి వుండిపోయింది. ఒకరికొకరు చేయూతనిచ్చుకొంటూండటంబట్టి వాళ్ళిద్దరూ యేనాడో ఒకే రక్త సంబంధం కలిగిన వాళ్ళనిపిస్తుంది.

భువనేశ్వరి భర్త ఆనంద్ మోహన్, సువర్చల భర్త శ్రీకాంతీనాథ్ ఒకే ఆఫీసులో పనిచేయడం - ఒకే పేటలో ఒకరియింటి కెదురుగా వొకరు వుండటం

వలన వారి వారి సుఖమయజీవిత ప్రతిబింబాలు స్పష్టంగా కనిపిస్తూనే వుంటయి.

భువనేశ్వరి చామనచాయ.

సువర్చల శ్యామలవర్ణం.

ఆనంద్ మోహన్ ఎర్రనివాడు.

క్రాంతీనాథ్, ఆనంద్ మోహన యింటికి యిరుగుపు రాడు. నిశ్చలంగావున్న నీటిమీద చిన్నగాలి సోకితే కదిలి బయలుదేరిన అలలమాదిరిగా వుంటుంది భువనేశ్వరి తలకట్టు.

అశోకవృక్షపు ఆకు కిరుప్రక్కల వంపులవలె వుంటుంది సువర్చల తలకట్టు.

ఇద్దరూ వాలుజడలు వేస్తారు.

ఇద్దరూ మధ్యపాపిడీ తీస్తారు.

సువర్చల భువనేశ్వరికన్న జెత్తెడెత్తు తక్కువ.

భువనేశ్వరి మొగంలో అజంతా శిల్పం కనిపిస్తూ వుంటుంది.

సువర్చల మొగంలో హంపీశిల్పం కనిపిస్తుంది.

ఆనంద్ మోహన్ అంటే భువనేశ్వరికి యెంత మమకారమో, అంతకు సరిసమానంగా క్రాంతీనాథ్ అతన్ని గౌరవిస్తాడు. ఆమెను సహోదరిగా చూసుకొంటాడు.

సువర్చలంటే క్రాంతీనాథ్‌కి యెంతటి అనిర్వాచనీయమైన మధురభావంవుందో, భువనేశ్వరికి దానికి రెట్టింపుమిన్నగా అతన్ని అన్నగారుగా చూసుకొంటుంది.

ఆనంద్ మోహన్ క్రాంతీనాథ్‌ని 'బావా' అని వేళాకోళంగా సంబోధించినప్పుడు సువర్చల, ఆనంద్ మోహన్ యెడల సహోదరత్వంలోని మహత్తర భావమాధుర్య మమకారాన్ని అనుభవించడానికి ప్రయత్నిస్తుంది.

2

ఆనాడు పౌర్ణమి. రజనీకాంతుడు ఒంటరిగా కూర్చొని గదిలో యేదో వ్రాసుకొంటున్నాడు. షుమారు పదకొండుగంటలు కావొస్తోంది. తీర్చి కాస్తున్న వెన్నెలలో రజనీకాంతుడు హాయిని పొందలేకపోతున్నాడు. కాల్చి, కాల్చి నోరుమంటెత్తుతున్నా, కొసలవరకూ కాల్చకుండా యే సిగరెట్టును విడిచిపెట్టలేకపోతున్నాడు. చుట్టూవున్న యిళ్ళల్లోని వారంతా నిశ్చింతంగా పడుకున్నారు. రజనీకాంతుని గది ఆ వూరిచివర, కాలువగట్టుకి మూడున్నరవందల గజాలదూరంలోవుంది.

తలుపుకొట్టిన చప్పుడు ఆ సమయంలో హఠాత్తుగా వినిపించింది. ఆ వినిపించడం అతనికి యేగాలి తప్పెట్లశబ్దమో అని వూరుకొన్నాడు. నిజంగా అటువంటి శబ్దం ఆవేళప్పుడు మ్రోగదంకద్దు. మళ్ళా మ్రోగింది.

"ఎవరూ ?" - అన్నాడు.

"నేనే ..." - అన్నస్వరం గుర్తుపట్టాడు. గబాలునవెళ్ళి తలుపుతీస్తూ-

"రాగవర్ధనీ ! యేమిటీ రావడం" - అన్నాడు.

"యేముంది రావడానికి. భయమేసిందా ?" అంది.

"యీ వేళప్పుడా వచ్చేది !"

"రావాలనిపించింది వచ్చేసాను"—

"వస్తానని కబురుకూడా చెయ్యలేదే !"—

"నేను మాత్రం అనుకొన్నానా ! వస్తానని. ఒకనిద్ర తీసాను. మెలకువ వచ్చింది. యిక యెంత ప్రయత్నించినా కనుకుపట్టలేదు. యేంతోచలేదు. యేంచేయను ? మెల్లగాలేచి వచ్చేసాను."

రజనీకాంతుడు అంతావింటూ నెమ్మదిగావెళ్ళి తలుపులు వేసివచ్చాడు ... ఒక సిగరెట్టు వెలిగించి,

"ఏమిటి కబుర్లు" - అన్నాడు.

"అలా వున్నారేం" అంది రాగవర్ధని.

"ఏం. ఎలావున్నా ! బాగానే వున్నాగా."

"చిక్కిపోయారేం ! ..."

"చిక్కడమా ! లేదే ..." అని యిక చెప్పడానికి యిష్టపడలేదు.

రాగవర్ధనికి ఆ అసంపూర్తి వాక్యం ఆందోళన కలిగించింది. 'రజనీకాంతుని హృదయేశ్వరి'నని లోకం అంతా చాటుచాటుగా అనుకొంటుంటేకూడా ఆమె యింతగా జంకుపడలేదు, భయపడలేదు, కాని యీ వాక్యం, యేజంకూ, కొంకూ ఎరుగని హృదయానికి యీ నాడు ఆందోళన కలిగించిందంటే ఆశ్చర్యంగానే వుంటుంది.

"ఏమీ లేదని దాస్తారెందుకు? నాతోకూడా చెప్పకూడదా!" అంది రాగవర్ధని.

కళ్లజోడుతీసి, తుండుగుడ్డతో ముఖం తుడుచుకొంటూ,

"ఆకలి చచ్చిపోతే అన్నం తినడం మానేశాను" అన్నాడు రజనీకాంతుడు.

రాగవర్ధనికి మరీ ఆశ్చర్యం - ఆదుర్దా యెక్కువయినయి. "ఆకలి చావడమేమిటి?" "ఆకలి యెందుకు చస్తుంది?" "యెప్పుడు చస్తుంది?" "అసలు చావడానికి కారణం?" యిత్యాది ప్రశ్నలు ఒకదాని వెంట వొకటి పరుగెత్తుకొంటూ వచ్చాయి.

"నాకేం అర్థంకావడంలా మీ మాటలు."—

"అర్థమయ్యేటట్లుగా చెప్తే, అనవసరంగా బాధ పెట్టినవాణ్ణి అవుతా! నిన్ను చూస్తూ చూస్తూ బాధపెట్టడం నాకిష్టంలేదు వర్ధనీ!"

"అంటే ... !"

"అంటే . . నేను . . యింటికి . . వెళ్ళి . . భోజనంచేయడం...మానివేశాను .. జీతాలు యింకా రాలేదు. ఒక వారంలో వస్తాయి...." అన్నాడు.

"ఎన్నాళ్లయింది యింటికెళ్లకుండా మానేసి?—" అంది.

"ఒక వారం అవుతుంది."

"అప్పటినుంచీ భోజనం లేకుండానే వున్నారా!"

"ఏంచేయను?"

"మొన్నొచ్చినప్పుడు మరి నాతో చెప్పలేదేం?"

"ఎందుకు?"

"ఎందుకేమిటి! బాగుంది. వారంరోజులనుంచి అన్నం తినకుండా, అవి యివి చిరుతిళ్లుతిని, కాఫీలు త్రాగుతూంటే ఆకలి చావక యేంచేస్తుంది చెప్పండి. కనీసం కబురు పంపినా చాలుగదా! మా పాపకిచ్చి క్యారియర్ పంపేదాన్ని. ఎలా వుండగలుగుతున్నారండి! మరి ఆఫీసులో యెలా పనిచేస్తున్నారు!"

"ఏం చేయను. తప్పుతుందా! యేదో సామెత చెప్పినట్లు మంత్రిసానితనం వొప్పుకున్న తరువాత యేదో చ్చినా చేయాలి." —అన్నాడు రజనీకాంతుడు.

"యేమైనా పోట్లాడుకొన్నారా!" అని అడిగింది రాగవర్ధని.

"పోట్లాడుకోలేదుగాని, మనస్పర్ధలు — మాట పట్టింపులు వచ్చాయి!" అన్నాడు రజనీకాంతుడు.

కూర్చున్న రాగవర్ధని చటుక్కునలేచి, యిప్పుడే వస్తానంటూ వెళ్ళిపోయింది.

రజనీకాంతుడు తెల్లపోయాడు—ఆ వెళ్ళిపోవడం చూసి.

గుమ్మంలోకి వెళ్ళి, వెళ్లే రాగవర్ధన్ని పిలుద్దామనుకొన్నాడు. కాని కుర్చీలోంచి, లేచి వెళ్ళలేకపోయాడు. అలాగే చతికిలబడి మళ్ళా వ్రాద్దామనుకొని ప్రయత్నించాడు. కాని ఆ భావాలు క్రొత్తవిగా కనిపించి, సందర్భోచితంగాలేవు. తర్వాత యేదో వ్రాద్దామని ఉంకించాడు. కలం సాగలేదు. ఆలోచనలు మాలతీ లతల్లాగా అల్లుకొంటున్నాయి. అప్రయత్నంగా అతని నోటివెంట 'రాగవర్ధనీ-రాగవర్ధనీ' అని రెండుసార్లు పిలుచుకొన్నాడు. హృదయం బావురుమని యేడ్చింది. రెండు—మూడు కన్నీటిబొట్లు కూడా తెల్లకాగితంమీద టపీ, టపీమని పడ్డాయి.

'రాగవర్ధని'ని రజనీకాంతుడు ఆరాధ్యదేవిగా భావిస్తాడు.

ఆమెపట్ల అతని హృదయం రూపనవతీతంలో రంగరించుకొని వుంటుంది.

'ఆనందం' అంటే యేమిటో యెరుగని జీవితానికి నందనోద్యానంలో విహరింపచేసి అనూహ్యమైన మధురానందం చవిచూపించింది తొలిసారిగా రాగవర్ధని.

ప్రపంచంలో 'ఆనందం' అంటే యేమిటో తెలుసుకొంది. రాగవర్ధని గాంధార శిల్పసౌందర్యంవల్లనే తన పట్ల, పరితాప హృదయానికి పరమ సంతోషం కూర్చగలిగింది అనురాగ లలనారాణి రాగవర్ధని."

యీ అనుభూతిని రజనీకాంతుడు ముఖతా వ్యక్తం చేస్తుంటే, ఒక నవరసభరితమైన కావ్యం చదివినట్టుగా వుంటుంది. అందుకే అలంకారికులు అన్నారేమో "వాక్యం రసాత్మకం కావ్యం" అని

రాగవర్ధన్ని ప్రేమిస్తూన్నానని తనలో తానెప్పుడు రజనీకాంతుడు అనుకోలేదు. కాని ఆమె అంటే అతనికొకవిధమైన మధురభావం — వెలకట్టలేని నమ్మకం వుంది. అది 'యీ విధమైనటువంటిది' అని వ్యక్తం చేయలేదు. ఒకవేళ అది వ్యక్తం చేయడానికి ప్రయత్నిస్తూన్నాడని వూహకొంటే మనకు వినిపించేది "ప్రేమిస్తున్నాననే" ధ్వని. యీ ధ్వనికి హృదయంలోవుండే ధ్వనికి వున్న వ్యత్యాసం తెలుసుకోవడమే జరిగితే అతని మనస్తత్వం అవగాహనకాకమానదు. తనకు తానై తన ఆలోచనలలోని వుద్దేశ్యాలను [illegible] రాగవర్ధని [illegible] లోపలికి [illegible]. [illegible] ఆలోచనల్లోంచి రజనీకాంతుడు దూసుకొచ్చి

"వర్ధనీ! [illegible]!" — అన్నాడు.

"యింతగా యేమిటో [illegible], ముందు తెలిసి [illegible]." అంటూ [illegible], అలమారలోంచి గ్లాసు తీసి, కూజాలో మంచి నీళ్లు అందులో పోసి, . .

"కూర్చోండి" — అంటూ క్యారియర్ గిన్నెలోని వంటకాలన్నీ ఆకు చుట్టూరా పెట్టుకొంటూ వస్తోంది.

రజనీకాంతుడు ఒక్కనిముషంసేపు, తలవంచి వడ్డిస్తున్న రాగవర్ధని మొగంవంక తృప్తిగా చూసి "నీ ఋణం తీర్చుకోలేను వర్ధనీ!" అన్నాడు మృదువుగా.

(సశేషము)

—— o ——

మే నెల 26వ తేదీన మద్రాసులో కలవలకణ్ణాన్ చారిటీస్ వారి భవనమున శ్రీ శింగరాజు రామలింగశాస్త్రి గారి అధ్యక్షతన జరిగిన విద్వత్ సభలో కోటసోదర కవిచంద్రులు తమ రచనలు 'మాతృశ్రీ', కర్ణక ప్రబోధము' మొదలగు గ్రంథముల లోని కొన్ని భాగములను చదివి వినిపించుటతోబాటు అష్టావధానముచేసిరి. అధ్యక్షుల ప్రశంసలతోబాటు చారిటీస్ వారు అర్థనూట పదహార్లను కవిచంద్రులకు బహూకరించిరి.

# సునంధ

"పాంచాలి"

చరితలో సువర్ణాక్షరాల్ చెరగి పోక – "గుప్తయుగ" మొందుకలదు నిత్య మయ్యి
వెలిగి యారిపోయిన "గుప్త" - వెలుగులోన – కాంతికిరణాలు వెదజల్లు – గాథలెన్నో;
అందు "తోరమాను" చరిత – యందుకలదు – హిందు వాఙ్మయకారులు – పొందుపరచి
ఏగినా రక్తహస్తాల బాగి "తోర మాను" డనుచు "రజని ప్రియుడు" మాన చరిత.
అరుణ కిరణపంక్తి పడమ టాడి యాడి – రజనికిచ్చెనోయెను "హూణ్య ప్రవాసియు ప్రజ"
నిశికినోరు గొట్టు తలపు నిలిపిరోలు! – స్వార్థపరులు కోరుదురు పరార్థ మెప్పుడు.
రాత్రి పగటికి మధ్య సంగ్రామమయ్యె – అందు రాత్రియే జయమొంది అంధకార
కుంజరంబుల నిల్పెను ఘూకుడెగసె – రజని సేనలమింటిపై – రాసిపోసె!
ఏడీ? సేనాధిపతి యంచు ఎదురు తెన్ను లరయు చుండగ "రేరాజు" అరగు – డెంచె
కారు తేరు వరూధిని పారిపోయె - నీతియే గెలుపొందను – ఖ్యాతి నిలిపి?
వెన్నెల నిండుచుండ పుర – వీధులు బంగరు వన్నెతోడను
త్పన్నములయ్యె స్వర్ణమును – తాపన చేసిన చందముండగా.
తెన్నున బోవు బాటనొక – తెన్నున నున్నది "వీర దేవ్" గృహం
బన్నిట మిన్న యెన్నగృహ – మంతకు వన్నె "సునంద" నెన్నినన్".
అట్టి "సునంద" నందము మ - హోంధత జేసెను రాజసైన్య మున్
కట్టిడితోడ వచ్చి తమ – కామము దీర్పుమటంచు కోరినన్
కట్ట యిదేమి వింత కుల – కాంతను గోరుట పాడిగాదు ఇ
ప్పట్టున పొందు జాతి చర – బాపెడి వీరులు తప్పమీకనన్.
కామము గప్పి కొన్న తమ – కన్నుల విప్పరు నీతి మంతులై
"భామిని" పల్కు పల్కుల సుభావము తెల్యదు వారి మానసం
బామె కపుంగలిన్ తలచి - బాధల ముంచిన దేమో! "ఏలనే?
కోమలి! నీతి మాటలని" – కొంగును ముట్టగముందు కేగినన్ !
"అన్నా పిల్లలగన్నదాన ఇది య – న్యాయంబు దేవుండొకం
డున్నాడయ్యా! సహింప జాలడిది ఈ – ఉద్యోగమున్ మానుడూ

కన్నార్పన్ జరిగోవు కార్యమునకై - కామాంధులై తిర్గుటల్
మన్నన్ బొందదు హైందవాగనలకీ - మానం బెగణ్యంబుగా'

లౌకిక మెరిగిన నీచుడు - ఏకాయెకినేగి తెచ్చి - ఏమనెదివుడూ?
ఊకొను లేకున్ననీ - మూకను చంపెద మనంద "ఊఁ! యను" మనుచున్ !

కన్నబిడ్డల తన ముందు - కాలదన్ని - కన్నుమూసుక నిట్టూర్చె కన్న తల్లి
బిడ్డ మమకారమైనను - అడ్డపడదు - వీరదేవుడంతలో నిలు - దూరినాడు

ఆ పదాల మతనిచుట్టి - అణచికట్టి - "ఇప్పుడేమందు? ఇంతిరో! ఏది దిక్కు?
నీదు భర్తను పిల్లల - నీయెదుటనె-చంపచూతువె? మాకోర్కె - సఫల పరుతె?"

అనిన వినుచు కాంత అనియె అనుజులార! - భారతీసతెన్ని - బాధలైన
ఓర్చు మానభంగ మోర్వంగ లేదయ్య - ఇచ్చవచ్చినట్లు - లేగు డనిన.

కొట్టిరికట్టిరి చక్రవు - లటడగున నెట్టి రంత - అశ్వములాదలన్
పట్టియుపతియున్ మడిసిరి కట్టా కామాత్ములెట్టి కఠినాత్ములకో!!!

"పతికండెన్ సతికిలలో - అతిముఖ్యము మానమనుచు ఆమెయెనుడి వెన్
అతుకుల జీవిత మందున అతి ముఖ్యము మానధనము అతివలకనుచున్.

పిచ్చి పట్టి "సునంద" తా-చచ్చి పోయె - "గుప్త" యుగమున తనపేరు గుప్తపరచె
ఎన్నియున్నవో కదయిట్టి - చిన్నికథలు - నీతి కేతాము లెత్తేడి - నిజచరితలు

—o—

## ఉపనయన మహోత్సవం

డాక్టరు యస్. శేషగిరిరావుగారి జ్యేష్ఠపుత్రుడు చి॥ రాధాకృష్ణకు 'గృహలక్ష్మి' గృహంలో గడచిన నెల 23వ తేదీన వైభవోపేతంగా యజ్ఞోపవీతధారణ జరిగింది. బంధుమిత్ర పరివారముల అభినందన ఆశీస్సులతోబాటు గాయత్రీదేవి అనుగ్రహవాత్సల్యాలు ఆయురారోగ్యాలను మహత్తరమైన భవిష్యత్పురోభివృద్ధిని చి॥ రాధాకృష్ణకు సమకూర్చగలవని ఆశిస్తున్నాము.

# అన్నదమ్ములు

"శాంతిశ్రీ"

రఘునాధరావుగార్కి తల నెరిసిపోయింది. అక్కడక్కడ పళ్లుకూడా వూడిపోయాయి. ఊడవూ! మరి ముసలితనంవస్తే! ఆయన వయసు షుమారు అరవై అయిదు సంవత్సరాలుంటుంది. కాని ఎప్పుడూ యేదో ఆలోచిస్తునట్లే కనిపిస్తారు రావుగారు. వారికి ముగ్గురు సంతానం. రవీంద్ర, నరేంద్ర అని యిద్దరు కుమారులు, ఉష అనే కుమార్తె. ఆయన భార్య శ్యామలాంబ, చాలా వుత్తమురాలు, శీలవతి. రఘునాధరావుగార్కి రవీంద్ర పుట్టిన సంవత్సరానికే నరేంద్రపుట్టాడు. ఉష నరేంద్రునికంటే ఆరేండ్లు చిన్నది. రావుగారు కుమారుల్ని డాక్టర్లని చెయ్యాలని వాళ్ల చిన్నతనంనుండి ఎన్నో కలలు గన్నారు. ఎన్నో ఊహా సౌధాలు నిర్మించుకున్నారు. వారికి చేతినిండా ధనంవుంది. వారి కోరికలు నెరవేరడానికాధనం ఎంతో వుపకరించింది. ఆయన కలలు కొంతమందిలోలా కలలుగానే వుండక నిజమైనవి. రవీంద్ర నరేంద్ర యిద్దరూ డాక్టర్లయ్యారు. అయితే రవీంద్రకీ నరేంద్రకీ ప్రకృతుల్లో చాలా భేదంవుంది. రవీంద్రకి గొప్ప బీద అనే తారతమ్యంగాని కులవిచక్షణగాని యేమీలేదు. తను గొప్పవారి బిడ్డనని నిద్రలోకూడ అతను గర్వపడడు. ఉషకి కొంచెం రవీంద్ర గుణాలే వచ్చాయి. రవీంద్రంటే యెక్కువ చనువు గౌరవం ఆమెకు. తన కుమారులిద్దరూ డాక్టర్లు; పయిగా ధనవంతులు. తప్పక చెరొక లక్షా కట్నం వస్తుందని అంచనా వేశారు రఘునాధరావుగారు. ఆయన అనుకొన్నట్లుగాక ఇద్దరికీకలిపి ఒక 'ల' కారమే పలికింది కట్నం. దానికి కారణం రవీంద్ర. రవీంద్ర కట్నాని కాశపడలేదు. అతని కాయాశ ఏనాడూలేదు. మనిషి చాలా నిరాడంబరుడు. అతను తనసహపాఠి మల్లికను ప్రేమించి పెండ్లాడటమే ఆనష్టానికి కారణం. ఈ పెండ్లి తండ్రికి సుతరామూ యిష్టంలేదు. తను చెబితే వినలేదని తల్లితోకూడా చెప్పించి చూశాడాయన. కాని రవీంద్ర వింటేనా. అతను హృదయాలను అర్థం చేసుకోగలడతనికీ హృదయంవుంది కనుక. డబ్బు లెక్కలలో తండ్రి హృదయం పాషాణమయిందంటాడు రవీంద్ర. ఈ వివాహం ఆ కుటుంబంలో కలతల్ని లేపింది. కుటుంబ విచ్ఛిన్నానికి కారణం అయింది. తండ్రి రవీంద్రుని యింట్లోనుండి వెళ్లగొట్టాడు. నరేంద్ర చూస్తూ వూరుకున్నాడేమీ చెప్పలేక. ఉష శ్యామలాంబ గోలు గోలున యేడ్చారు రవీంద్ర వెళ్తూంటే. రవీంద్ర ఆ వూరులోనే వేరే చిన్నయిల్లు కట్టుకున్నాడు. ప్రాక్టీసుకూడా ప్రారంభించాడు.

నరేంద్రకి తండ్రి యిష్టప్రకారం "గొప్ప" సంబంధం స్థిరమయింది. కట్నం తండ్రి కోరిక ప్రకారం లక్షరూపాయలు. ఆ తలిదండ్రుల కామె యొక్కతే కుమార్తె. పేరు ఉమాదేవి. వివాహం వైభవంగా జరిగింది. పెండ్లికి రవీంద్రుని తండ్రి పిలువనంపకపోయినా కన్నతల్లిప్రాణం వూరుకోకపోవడంచేత వెళ్ళి ఆ దంపతులను వెంటబెట్టుకుని వచ్చింది. ఉషకి మల్లికతో ఆ రెండు రోజుల్లో బాగా చనువయింది. మల్లిక శాంతం ఉష హృదయాన్ని దొంగిలించి తన వెంట తీసుకుపోయింది తనకు తెలియకుండానె. ఉష బి. ఎ పూర్తిచేసి యిక చదువుకు స్వస్తిచెప్పి యింట్లోనే వుంటోంది. తగిన సంబంధంకోరకు ప్రయత్నాలు సాగుతున్నాయి. ఆమె బాగా చదువుకున్నదాయెమరి. అందులో ధనవంతులబిడ్డ. వారి కోరికల ప్రకారం తగిన సంబంధం కుదరాలంటే మాటలామరి!

ఉమ అత్తవారింటికి కాపురానికొచ్చింది. పెద్ద కొడుక్కి పెండ్లయినా ఆ కోడలికి తొలుత నీ యింటి కాపురంచేసే అదృష్టం లేకపోయింది. ఆ యింట్లో మొదట ఉమాదేవి కాపరానికొచ్చింది. ఆ రోజామె

తెచ్చిన సారె పూరంతా పెద్దయెత్తున పంచిపెట్టారు. చూచేవాళ్లకెంతో ఘనంగా అత్తవారింట్లో అడుగు పెట్టింది ఉష. ఉషకూడా యింటర్ వరకూ చదివింది. విద్యావంతురాలు. అందమైనదీని. ఉషకి పెండ్లిఅవకముందే రవీంద్ర పెండ్లి గురించి జరిగిన గందరగోళమంతా తెలుసు. పెండ్లి రెండు రోజుల్లోనూ ఒక్కసారికూడా మల్లికతో నోరువిప్పి మాట్లాడలేకపోయింది. ఆమె దీనరూపం ఉష హృదయంలో పీఠం వేసింది. మల్లికను [illegible] ఎట్లా తప్పుకుపోయిందో [illegible]. ఉష పెండ్లి మాటలు సాగుతున్నాయి. రవీంద్రకో స్నేహితుడున్నాడు. వాళ్లిద్దరూ చదువుకునే [illegible] ఇంటికి వచ్చేవాడప్పుడప్పుడూ కరుణాకర్. అతను మధ్యతరగతి కుటుంబంలోనివాడు. ప్లీడరు చదివి ప్రాక్టీసు పెట్టాడు. అతనితో ఉషకూడా చాలా చనువుగా వుంటుంది. అతనంటే యీమె కిష్టంకూడా. కాని యతన్ని ప్రేమిస్తున్నానని మాత్రం ఉష పైకెన్నడూ అనలేదు. కాని రవీంద్రకు తెలుసు చెల్లెలి హృదయం. రవీంద్ర ఒక రోజు నరేంద్రుణ్ణి హాస్టల్లో కలుసుకొని ఉషని కరుణాకర్ కిస్తే బావుంటుందని సూచించాడు. నరేంద్రుడు అన్నతో బాగానే మాట్లాడతాడుగాని అన్న చేసేపనులకు మాత్రం ఆమోదించడు. అన్న చెప్పిందంతావిని నాన్నగార్కి చెప్పిచూస్తానని సమాధానం యిచ్చాడు. నిజానికి నరేంద్రునికా సంబంధం యిష్టంలేదు. తండ్రికూడా అందుకనుగుణంగానే "ఏమిటీ? ఆ చెట్టుక్రింద ప్లీడరుకా మన బంగారుతల్లి ఉషనిచ్చేది. ఇలాటి సంబంధమా చెల్లెలికి తీసుకువచ్చేది. చెడినవాడెలాగూ చెడనే చెడ్డాడు - మళ్లా కుటుంబంలో జోక్యం ఎందుకు కలుగజేసుకోవాల"ని పెద్దకొడుకుమీద మండిపడ్డాడు రఘునాథరావు. రవీంద్ర అంత కానిపనేం జేశాడు యీ నిందలుపడడానికి? తనకులం అమ్మాయినే పెండ్లిజేసుకున్నాడే. భగవంతుడా రత్నాన్ని బీదవాళ్ళింట్లో పుట్టించాడు. దానిలో రవీంద్రుడు చేసిన తప్పేముంది నిజానికి. కించిత్ కూడా మనకి కనిపించదు. కాని రావుగారి దృష్టిలో క్షమింపరాని పెద్దనేరముంది. ఒకరోజు వాళ్ళ కాలేజీలో యేదో పాతవిద్యార్థుల ఫంక్షన్ కి ఉష వెళ్ళింది. రవీంద్ర, నరేంద్ర, కరుణాకర్ కూడా వెళ్ళారు. కరుణాకర్, రవీంద్ర ఒక ప్రక్కన కూర్చున్నారు. నరేంద్ర రెండవ ప్రక్కన కూర్చున్నాడు. ఉష వెళ్ళి వాళ్ల పెద్దన్నయ్య ప్రక్కన కూర్చుంది.

"ఏం ఉషా! అమ్మ నాన్నా అంతా బాగున్నారా" అన్నాడు రవీంద్ర.

"అంతా బాగానే వున్నారన్నయ్యా" అంది ఉష. అంతలోకే కరుణాకర్ "ఏం ఉషా! ఈ మధ్య అసలు కనిపించడమే మానేశావ్. ఇదివరకటికంటే చాలా మారిపోయావు సుమా" అన్నాడు.

"లేదు కరుణా! నేనేం మారలేదు. నువ్వే మా యింటికి రావడం అసలు మానేశావ్. ఏం! పెద్దన్నయ్య లేకపోతే మాత్రం ఇంకా ఎవరూ లేరనుకున్నావా?" అంది కొంచెం కష్టంగా.

ఇది వింటూన్న రవీంద్ర "నువ్వు మా యింటికి రాలేదు. నువ్వు మా యింటికిరాలేదు అనుకోకపోతే ఇద్దరూ ఒక్కింట్లోనేవుండే యేర్పాటు చేసుకుంటే ఏ బాధ లేదుగా" అన్నాడు. దానికి కరుణ ఉష వైపుచూస్తే ఉష మందహాసంచేసి తలవంచుకుంది. రవీంద్ర ఏంరా కరుణా సమాధానం చెప్పవేంఅంటే "నా మనస్సు నీకు తెలిసింతరువాతకూడా ఎందుకురా యీ పరీక్షలు" అని నవ్వాడు చిన్నగా.

దూరాన్నుంచి ఇదంతా చూస్తున్న నరేంద్రుడు కోపంతో ముక్కుపుటా లెగురవేస్తున్నాడు. అంతలోకి ఏదో వుపన్యాసం మొదలుపెట్టడంవల్ల సంభాషణాగిపోయింది. నరేంద్ర మధ్యలోనే లేచి యింటికి వెళ్ళాడు కోపంగా. కొడుకు కోపంగా వుండటం చూచి తండ్రి కారణం అడిగితే పూసగ్రుచ్చినట్లు జరిగిందంతా విన్నవించాడు. తండ్రి నిప్పుత్రొక్కిన కోతిలాగ గంతులువేయడం మొదలుపెట్టాడు. అంతలోకి ఉష వచ్చింది.

"ఉషా ఎక్కడికి వెళ్ళావ్?"

"మా కాలేజి పాతవిద్యార్థుల ఫంక్షన్‌కి వెళ్తానంటే వెళ్ళమన్నారుగా నాన్నా!"

"ఫంక్షనుకి వెళ్ళమంటే ఆ వెధవతో సరసాలాడమనా అర్థం?"

"అదికాదు నాన్నా. పెద్దన్నయ్య ..."

"హుఁ! పెద్దన్నయ్య. మాలావు దొరికాడు పెద్దన్నయ్య! వుద్ధరించడానికి. ఇదిగో ఉషా-చెబుతున్నాను విను. ఈ రోజు మొదలు ఎక్కడికీ వెళ్ళకు. నీ పెద్దన్నయ్యతోగాని వాడిఫ్రెండుతోగాని మాట్లాడావంటే మాట దక్కదు. వెళ్ళుపైకి" అని కఠినంగా మందలించాడు. ఉష బరువైన హృదయంతో వెళ్ళిపోయిందక్కడనుండి. ఆ రోజామె భోజనం చెయ్యలేదు. ఏడుస్తూనే ఆ రాత్రి గడిపివేసింది. ఇవన్నీ చూస్తూ గ్రుడ్ల నీరు కుక్కుకుంది తల్లి శ్యామలాంబ. ఉష బెంగతో మంచం పట్టింది. నాన్నగారలా అనగానే నరేంద్రతోకూడ చెప్పి చూసింది ఉష. కాని లాభంలేకపోయింది. ఉష పదిరోజుల్లో బాగా చిక్కిపోయింది. శ్యామలాంబ భర్తతో చెప్పింది, ఉష బెంగతో చిక్కిపోయిందని. రావుగారు నరేంద్రను పిలిచి కాస్త ఉషకి నచ్చచెప్పమని చెప్పారు. ఎలాగయినా అన్నకి చెల్లెలిమీద అసలు ప్రేమలేకుండా పోతుందా! — చిక్కి శల్యమైన ఉషని చూడగానే భాతృప్రేమ సహజరూపంతో పొంగి పొరలింది. "ఉషా!" అంటూ తల నిమిరాడు. ఉషకూడా అన్నయ్యా! అంటూ బావురుమంది. నరేంద్రమనస్సు కొంచెం చలించింది. అయినా ఉషకి తండ్రి చెప్పమన్నట్లు చెప్పిచూశాడు తండ్రికి జడిసి. కాని ఉష అందులకుసమ్మతి తెలిపింది. నరేంద్రునికి తండ్రి పట్టుదల తెలుసు. అందుకే అన్నను వెళ్ళగొట్టినప్పుడూ మాటాడలేక పోయాడు. ఇప్పుడు మాట్లాడలేక పోతున్నాడు తండ్రిదగ్గర. ఉష నరేంద్రుని అసమర్థతకు చాలా విచారించింది. మళ్ళా విషాదంతో మునిగింది. ఉషకి ఒకరోజు జ్వరం వచ్చింది. కాని తల్లికి కూడ చెప్పలేదామె. మరునాడుకూడా తగ్గలేదు. తల్లికి తెలిసిపోయింది కూతురు జ్వరంసంగతి. మూడో రోజుకి జ్వరం ఎక్కువయింది — శ్యామలాంబగారు రావుగారితో చెప్పి ఒక్కగానొక్క కూతురిలా అయిపోయిందని గుండెలు బాదుకుంది. రావుగారు వచ్చేసరికి ఉష పడుకుని వుంది. 'అమ్మా! ఉషా' అని పిలవగానే ఉష కళ్లు తెరచి కనుకొలుకుల్లో నీరునిండగా హృదయ విదారకంగా 'నాన్నా' అంటూ కన్నీరు కార్చింది. కాని రవీంద్ర జ్ఞాపకం రాగానే కరగిన ఆయన మనసంతా మళ్ళా ఒక్కసారి ఘనీభవించిపోయింది. నరేంద్ర ఏవో మంచిమంచి మందులే వాడుతున్నాడు చెల్లెలికి. కాని ఉషకి జ్వరం తగ్గుముఖం పెట్టలేదు. ఇంకా పెద్ద డాక్టర్లనికూడా పిలిపించారు రావుగారు. కాని లాభం కనిపించలేదు. ఉష ఒకరోజు జ్వరతీవ్రతలో "పెద్దన్నయ్య" అని కలవరించింది. అది విని పోనీ, రవీంద్రవస్తే తగ్గుతుందేమో నని భర్తతో చెప్పిచూసింది శ్యామలాంబగారు. రావుగారప్పటికి కూడ మనస్సు మార్చుకోలేకపోయారు. ఉష మధ్య మధ్య "పెద్దన్నయ్యా... వదినా" అని కలవరించుతోంది. ఒక రోజామె స్థితి మరీ ప్రమాదకరంగా వుంది. పెద్దడాక్టరుగారు కలవరింతలు విన్నారు. రవీంద్ర వస్తేగాని ఆమె ప్రాణం నిలవదని కచ్చితంగా చెప్పారు. నరేంద్రకూడా "నాన్నగారూ, చెల్లాయికోరకు-మన ముద్దుల ఉష కొరకు అన్నయ్యను, వదిననూ రప్పించండి. లేకపోతే ఉష యిక మనకి కనిపించదు" అంటూ బ్రతిమాలాడు. రావుగార్కి ఏమీ తోచడంలేదు. చివరికి తప్పక రవీంద్రకి కబురు పంపారు ఉషకి ప్రమాదంగా వుందని. మరుక్షణంలో రవీంద్ర, మల్లిక యిద్దరూ ఉషా అంటూ దగ్గరవాలారు. మల్లిక నిద్రాహారాలు మాని ఉషని కంటికి, రెప్పగా కాపాడింది. రవీంద్ర కూడ భోజనంకూడా మాని తన అనుంగు చెల్లాయి దగ్గరే కూర్చొని క్రొత్త క్రొత్త పుస్తకాలు చదివి ఎక్కడివో చాలా ఖరీదైన మందులు తెప్పించి వాడుతున్నాడు. స్పృహ రాగానే ఉష 'అన్నయ్యా! వదినా!' అంటూ ఆనంద భాష్పాలు రాల్చింది. అంత నీరసంతోనూ ఆమె కళ్లు ఆకాశంలోకి తారకలలా మిలమిల మెరిశాయి. ఆమె మనస్సు నిర్మలమైంది. పయిగా చల్లని మల్లిక చేతుల్లో త్వరలో కోలుకుంది.

ఈ అన్నా వదినల సేవని వారి ప్రేమను కనులార చూశారు రావుగారు. నరేంద్రకూడా వారిలోని గొప్పతనాన్ని గ్రహించగలిగాడు. ఉషకి జ్వరం తగ్గేసరికి రవీంద్రకి గడ్డం పెరిగింది. కళ్లు గుంటలుపడ్డాయి. మల్లిక వినీలకుంతలాలు తైలసంస్కారం లేక పిచ్చిగా వుంది. ఆమె కళ్ళక్రింద నల్లదనం స్పష్టంగా కనబడుతోంది. ఉషకి జ్వరం తగ్గాక వారికి సంతోషం-బలం వచ్చాయి. ఉషకి బాగా స్వస్థతచేకూరి లేచి బాగా తిరుగుతోంది. ఇల్లు ఎంతో కళకళ్లాడుతోంది ఎంతో కాలానికి. ఒకరోజు రవీంద్రుడు "నాన్నగారూ. ఇక మేము మా యింటికి వెడతాము. ఉష కులాసాగా వుందిగా" అన్నాడు. ఆ మాట వినగానే రావుగారి కళ్ళవెంట కన్నీరు జలజలా రాలినవి. తలయెత్తి రవీంద్ర ముఖం చూసి "నాయనా! రవీంద్రా!" అంటూ ప్రేమతో కౌగలించుకున్నారు. రవీంద్రకికూడా కండ్లు నీరు నిండినవి "బాబూ. ఇప్పటి నీ తండ్రి ఇదివరకు ధనవంతుడు రఘునాధరావు కాదు బాబూ. తన ముద్దుబిడ్డల తండ్రిమాత్రమే బాబూ! నిజంగా మల్లిక ఎంత గుణవంతురాలు. ఆమె శాంతం ఓరిమి యిప్పటికిగాని యీ పాపాత్ముడు తెలిసుకోలేకపోయాడు. ఇక నీవూ, అమ్మాయీ యీ యింట్లోనే వుండాలి. కాదంటే యీ ముసలి తండ్రిమీద ఒట్టేబాబూ" అంటూ కళ్లు తుడుచుకున్నాడు. ఈ మాటలు విని శ్యామలాంబగారు పొంగిపోయారు. ఉష ఆనందానికి అంతేలేదు. నరేంద్రకూడా చాలా సంతోషించాడు. ఉమకి అక్కగారి గుణగణాలు అర్థమైనాయి. ఆమె మనసుకూడ మారిపోయింది. మల్లిక, ఉమ, ఉషలను చూసి రావుగారెంతో సంతోషించారు. ముగ్గురూ సరస్వతి లక్ష్మి పార్వతులని తలపోశారు. ఒకరోజు ఎవరికీ చెప్పకుండా రావుగారూ ఒకఘన కార్యం చేశారు. అదేమిటని అడుగుతున్నారా? కరుణాకర్‌కి కబురంపారు. కరుణాకర్ రాగానే రావుగారెంతో ఆదరించి కుశల ప్రశ్నలువేశారు. ఈ అవ్యాజ ప్రేమకు కరుణాకర్ ఆశ్చర్యపడ్డాడు. కరుణాకర్‌తో త్వరలోనేముహూర్తాలున్నాయనీ, దగ్గరముహూర్తంలోనే పెండ్లి జరిగిపోవాలనీ రావుగారు సూచించారు.

ఇది విని ఉష గదిలోనుండి మెటమీదకువచ్చి ఎదురుగా కనిపిస్తున్న కరుణని చిలిపిగా వెక్కిరించింది. అనుకున్న ప్రకారం వివాహం వైభవంగా జరిగిపోయింది. కట్నం ప్రసక్తే గాలేదసలు. తనకున్న ఆస్తి సంతను రావుగారు మూడు భాగాలుచేసి ముగ్గురికీ పంచివేశారు. కాని ఆ యింటి ఆచార వ్యవహారాలన్నీ మారిపోయాయి సుమా! యీ చివరి సంగతులు జరిగేనాటికి!

---

"ఏమండీ ప్రొడ్యూసర్‌గారూ! పాలని నీళ్లు పంపారేమిటి నిన్న షూటింగ్ సందర్భమున!"

'పొరబాటు - యివ్వాళషూటింగ్‌లో త్రాగవలసింది విషం! నిజమైనదే పంపమంటారా"

♦ ♦ ♦

"అదేమిటిరా! ఒకదాని వెంబడి మరొకటి సిగరెట్లు అలా తగలేస్తున్నావు!"

"మన కాలేజీ మాగ్జైనుకు పొగ త్రాగడం దురలవాటనే వ్యాసాన్ని వ్రాస్తున్నారా"

♦ ♦ ♦

"శెట్టిగారూ! ఏమిచేస్తున్నారండీ"

'ఏమిచెయ్యడంలేదు రామయ్యా'!

"అయిదు రూపాయలు అప్పిద్దురూ!"

'అయితే మంచినిద్రలోనున్నాను'

పిళ్లా సుబ్బారావుశాస్త్రి

---




# కాటుకి తగ్గ దెబ్బ

జమీందారుగారబ్బాయి సుందరం పుట్టినరోజు పండగ ఆ వేళనే. జమీందారుగారికి చాలా కాలానికి వరప్రసాదంగా పుట్టాడా పుత్రుడు. చిన్నప్పట్నుంచీ ఎంతో గారాబంగా పెంచుతూవచ్చారు. ఆ పుత్రుడి పుట్టినరోజు పండగ చాలా గొప్పగా జరిగింది.

ఆ రోజు రాత్రి జమీందారుగారు పెద్దవాళ్ళందరికి తేనీటివిందు, తర్వాత చిన్న గానకచ్చేరి జరపాలనుకున్నారు. శారద అనే ఆవిడ సంగీతంలో మంచిపేరు సంపాదించింది. గానకోకిల, గానవాణి, సంగీతరాణి అని చాలా బిరుదులు సంపాదించింది. శారద అప్పుడప్పుడు సినిమా పాటలుకూడా పాడుతూ వుండేది. శారద గొంతు మాధుర్యంగలదయితే అవ్వొచ్చుగాని, ఆమెమాత్రం సౌందర్యవతిగాదు. అలాగని కురూపి మాత్రంగాదు. ఒకచెయ్యి వంకర, ఒక కన్ను గుడ్డిది, అంతే...! ఆమె అందం యెవరిక్కావాలి? ఆవిడ పాటవిని ఆవిడ్ని మెచ్చుకునేవారంతా. ఆ రోజు రాత్రి జమీందారుగారు ఆ "శారద"నే పిలిపించారు.

తేనీటివిందు కాగానే, సాయంత్రం ఏడుగంటలకు గానకచ్చేరి ప్రారంభమయింది. రాత్రి పదిన్నరవుతున్నా యెవరూ కదలలేదు. అంతా తన్మయులయి వింటున్నారు. పెద్దవాళ్ళు ఆమెని బ్రతిమలాడి పాడమన్నారు. ఆమె మధ్యమధ్య విశ్రాంతి తీసుకుంటూ అందర్నీ సంతోషపెట్టింది.

గానకచ్చేరి ఎలాగయితేనేం ముగిసింది. జమీందారుగారు చాలా సంతోషించి, తనవ్రేలి ఉంగరం తీసి లేచివెళ్ళి అందరిలోనూ 'శారదకి' బహుమతిగా యిచ్చారు.

శారద అందరికీ వినయంగా, సగౌరవంగా వందనా లర్పించింది. జమీందారుగారు అప్పుడు చూశారు శారదని, ఆమె అందాన్ని! ఆయనికి ఎంత గొప్పవారినయినా పరాభవం చెయ్యాలని వుండేది. అది దురుద్దేశంతో గాదు. ఊరకే అందర్నీ నవ్వించాలని కోర్కె. ఏదయినా చెడ్డపని చెయ్యాలనిచేసినా, వూరికే చేసినా కీడే తీసుకొస్తుంది.

"శారదా దేవీ! మీ గానం చాలా బావుంది కానీ...సరస్వతీదేవి వుందిచూశారూ; ఆవిడ గుడ్డిది సుమండి ...! తెలివితక్కువది గూడా ...!! మీ రందుకు ఒప్పుకుంటారా?" అన్నారు జమీందారు గారు అలా నుంచోనే!

"మీరు అలా అనడానికి కారణం చెబుతారా?" అని అడిగింది శారద ఉంగరం చూస్తూనే.

"ఎందుకని అంటారా? కోపగించుకోకండి ... సరస్వతిదేవి గుడ్డిది, తెలివి తక్కువది కానట్లయితే మీలాంటి అనాకారిని ఎందుకాశ్రయించింది? ఆవిడకు మీకు చెయ్యి వంకర అని, కన్ను గుడ్డి అని తెలిస్తే యీ గాన మాధుర్యాన్ని కంఠమాధుర్యాన్ని యిస్తుందా...?" అన్నారు జమీందారుగారు.

అలా జమీందారుగారు అనగానే శారద మనసు చివుక్కుమంది. నలుగురూ ఆమెవైపు ఎగతాళిగా హేళనగా చూశారు. అయితే శారద అంత తెలివి తక్కువదిమాత్రంగాదు. ఆమె చమత్కారి



"క్షమించాలి...! అలాచూసే మాటయితే లక్ష్మీదేవికూడా 'గుడ్డి' దేనని అనాల్సివస్తుంది...!" అన్నదామె.

'లక్ష్మీదేవి గుడ్డిదా...?'

"అవును. గుడ్డిదేగాదు. బుద్ధిలేనిదికూడా ...! ఎలాగనంటారా? గుడ్డిదికాకుంటే, మీలాటి వాళ్ళు అప్పుడు కడా మీముక్కల్నంత శ్రీయించిందా? మిమ్మల్నెం దుకు జమీందారుగా చేసింది?"... ఇలా శారద అన గానే జమీందారుగారి కళ్ళప్పుడు ఎంతో ఎక్కసాగ చూశారు. ఆయనకి ఒక కాలు అవిటిది...!

జమీందారుగారి నడకనుబట్టి శారద మొందే కని పెట్టింది. జమీందారుగారికి అలా శారద అనగానే మండిపోయింది కాని, ఏం చేస్తారు...?

ఒకరి మనసు నొప్పించడం దేనికి! తర్వాత తన మనసు నొప్పించుకోవడం దేనికి...?

— పి. సుబ్బారావుశాస్త్రి.
ఎస్. నాగమణి.

# వీర్బలుని యుక్తి

శ్రీ జి. చతుర్‌లాల్

అక్బరు పాదుషా కొలువులో వీర్బలుడను హైందవుడు విదూషకుడుగా నుండేవాడు. అతనంత తెలివిగలవాడు ఢిల్లీ పట్టణములోనే కాక ఇంకెచ్చట యుండడు. అందువలన అక్బరు పాదుషాకు అతనంటె చాలా అభిమానము.

ఒకనాడు చక్రవర్తి కొలవుతీర్చి యున్నారు. వారికొక ఆలోచన తట్టింది. వెంటనే వీర్బలుని పిలిచి చక్రవర్తి అతనితో, "వీర్బలా! ప్రపంచములో రెండే రెండు బలాలున్నవి. అందులో ఒకటి బాహుబలము, రెండవది బుద్ధిబలము; ఈ రెండు బలాలలో గొప్పదేది?" అని మందహాసముతో నడిగెను.

"ప్రభూ! యుక్తిబలమే గొప్పది" అని ఎంత మాత్రము తొణకక వీర్బలుడు జవాబిచ్చెను. కాని చక్రవర్తి ఆగనిని పరీక్షించ నెంచి అపుడు యూరకొనెను.

వీర్బలుడు ప్రతీరోజు ఉదయము రాజ భవనమున కెదురుగానున్న సరస్సునందు స్నానము చేయుటకు వెళలుచుండెను.

ఒకనాడు నియమప్రకారము వీర్బలుడు స్నానమునకు సరస్సు దగ్గరకెళ్లి స్నానము చేయ నారంభించెను. కొంత సేపటికె ప్రక్కవీధిలోనుండి, "పరుగెత్తండి, పరుగెత్తండి. అమ్మయ్యో! మదించిన యేనుగు వస్తున్నది" అను కేకలు వీర్బలునకు వినబడినై.

వీర్బలుడు తొందరగా స్నానముచేసి తొందర తొందరగా బట్టలుతొడిగి అచటి నుండింటికి వెళ్ళుటకు సిద్ధపడేటంతలో

ఏముంది! తన ఎదుట నలుబది, ఏబది అడుగుల దూరములోనే శరవేగముతో ఏనుగు పరుగెత్తుకొని తనవైపే వస్తున్నది. ఇంక పదినిమిషాలల్లాగినచో ఏమగునో! రాజభవనములోని కిటికీయందు చక్రవర్తి మందహాస్యముచేయుచు కనబడెను. ఇక వీర్బలునకు సంగతంతా యర్థమైనది.

అతనికి మెరుపులాంటి ఒక ఆలోచన తట్టింది. ఏనుగు ఒక అడుగు దూరములో యున్నదనగా వీర్బలుడు తన ఎదుటనున్న ఒక కుక్కయొక్క నాల్గుకాళ్లుపట్టుకొని గట్టిగా యేనుగుతొండముపై విసిరెను. గాఢనిద్రలోనుండి లేచి గాభరా అయిన కుక్క తన పండ్లతో ఏనుగు తొండమును గట్టిగాకొరికెను బలముగా విసరుటచేకుక్క కాలిగోళ్లు ఏనుగు తొండముపై గ్రుచ్చుకొనినవి. అకస్మాత్తుగా తనపైన వచ్చిన ప్రమాదమును తప్పించుకొనుటకు ఏనుగు వెనుదిరిగి పరుగెత్తెను. ఇదంతయు వ్రాయుటకే ఇంత కాలమైనది కాని ఇదంతా కన్నుమూసి తెరచేటంతలోనే జరిగినది.

ఇదంతయు కిటికీలోనుండి చూస్తున్న అక్బరుపాదుషా పరుగునవచ్చి వీర్బలుని కౌగలించుకొనెను.

మరుసటిరోజు ఉదయము అక్బరు చక్రవర్తి నిండుసభలో, "సభాసదులారా! నిన్న జరిగిన సంఘటన మీకు తెలిసినదే. అది నేను వీర్బలుని బుద్ధి కుశలతను సమయస్ఫూర్తిని పరీక్షించుటకు చేయించితిని. అందులో వీర్బలుడు మృత్యుముఖమునుండి తన ఉపాయమువలన తప్పుకొని, అన్ని బలములకంటే యుక్తి బలము గొప్పదని నిరూపించాడు. ఇటువంటి తెలివిగలవారు మన సభలో యున్నందులకు నేను గర్విస్తాను. నేటినుండి వీర్బలుడు మన ఆస్థాన ప్రధానమంత్రి" అని చెప్పెను.

సభికులందరు హర్షించిరి.

చూచారా! బాలలూ! వీర్బలుని యుక్తి! ఇట్లే మీరందరుకూడ ఉపాయముచేత ఎంతటి అపాయమునుండైన తప్పించుకొనవచ్చును.




పరమ సాధన : విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రి, ప్రకాశకులు : సాధన గ్రంథమండలి, తెనాలి. వెల 0-12-0.

ఈ గ్రంథము ఏడు భాగములుగా విభజింపబడియున్నది. దీనిలో ఏ లక్ష్యమును పురస్కరించి మానవుడు జీవనము గడుపవలయునను విషయముతో ప్రారంభమయి వైరాగ్యము, సాధన విఘ్నములు, సాధనసంపత్తి, భగవంతునితో విన్నపము, ఆత్మ సమర్పణలు వివరింపబడినవి.

గ్రంథకర్త అసామాన్యమైన ఆధ్యాత్మిక విజ్ఞాన అనుభవములు కలవారు. వారు వానిని సామాన్య ప్రజానీకానికి సులభం అందుబాటులోకి తెచ్చి సత్ఫలితాలు పొందేలాగ చేయాలని గ్రంథరచన, ప్రచురణల రూపంగా చేస్తున్నకృషి మహోత్కృష్టమైనది. అందుకు యీ గ్రంధరచన నిదర్శనము.

'సహకారము' స్వర్ణోత్సవ సంచిక మా కార్యాలయమునకు చేరినది. ప్రతి వెల రు. 3-0-0.

ఇందులో సహకారోద్యమ అభివృద్ధినిగురించి, జాతీయావసరములకు సహకారోద్యమ ఎన్నెన్ని విధాల బహుళోపయుక్తముకాగలదో వివరించే ప్రముఖుల రచనలు అనేకమున్నవి. సహకార ఉద్యమాన్ని గురించి తెలిసికోడానికి యీ సంచిక ఎంతైనా ఉపకరించగలదు. వలయువారు ఆంధ్రరాష్ట్ర సహకార యూనియన్, రాజమహేంద్రవరమునకు వ్రాయవలెను.

♦ ♦ ♦

వయోజనవిద్యా ప్రబోధ గీతాలు : శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు. ప్రచురణ కర్తలు: ఆంధ్రదేశ గ్రంధాలయ సంఘము, పటమటలంక, (వయా) విజయవాడ. వెల 0-3-0.

బాల్యంలో చదువుకోకుండా పెద్దవారైన తరువాత తాము చదువుకుందామనినా చదువేమి వస్తుందని నిస్పృహచెందే వారిని ఉత్సాహపరచి అక్షరాస్యులుగా రూపొందించడానికని యిందలి పద్యాలుద్దేశించబడినవి. శైలి సులభంగా నుండి గ్రంథకర్త ఉద్దేశం ఫలప్రదమగుటకనువుగా నున్నది. చదువుకోవలసిన ఆవశ్యకత, విద్యలేమివలన కష్టనష్టాలు ప్రజల హృదయాలను హత్తుకునేటట్లు రచన సాగింది.

♦ ♦ ♦

భారతీసమితి జయసంవత్సర వైశాఖమాస సంచిక మా కార్యాలయమునకు చేరినది. సంపాదకులు శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు. ఇందులో సాహిత్యమునకు సంబంధించిన రచనలు, కవుల, పండితుల పరిచయము పద్యరచనలు కలవు.



## భూదానయజ్ఞ సత్ఫలితాలు

భూదానయజ్ఞము ఆర్థిక సమత్వాన్ని అహింసాసిద్ధాంతము ననుసరించి రూపొందించడానికి తలపెట్టిన [illegible]. నేలను కేవలం [illegible] కాలాల భూవసతియుండి కొందరు, కొంతమాయినా భూవసతి లేక, (శమపడి కృషిచేద్దామన్నా అవకాశములేక, (శమకు తగిన ఫలితములేక జీవనోపాధ్యావసరాలను సమకూర్చుకొలేక అలమటించేవారు కొందరు. సమాజంలోని నానా [illegible] సామ్యభావ సద్భావములతో తమ అవసరాలకు మించియున్న భూవసతిలో కొంతభాగాన్ని భూమిని నమ్ముకొని జీవిస్తూనే భూవసతి లేనివారికి [illegible] తామే యిచ్చి సామాజికపురోభివృద్ధికి తోడ్పడునట్లు ఆచార్య వినోభా వేగారి నాయకత్వమున జరుగుచున్న కృషి (ప్రశంసనీయము. ఈ ఉద్యమం దేశ వ్యాప్తంగానేకాక అంతర్జాతీయ రంగంలో సయితం హర్షించబడు చుండుట గమనించతగినది.

అయితే భూవసతిలేని బీద, సాదలకు లభ్యమైన భూములను సాగు చేసికొనుటకు వలసిన ఆర్థికవసతులు, అవకాశములు లేనిచో వారు పొందగలిగే సత్ఫలితాలు శూన్యము. భూదానయజ్ఞంద్వారా పంచిపెట్టబడే భూముల సాగుబడి సందర్భమున సహకార సంఘముల నిర్మాణంద్వారానో లేక (ప్రభుత్వ సహాయ కార్య (క్రమము(క్రిందనో అవసరమయిన ఆర్థికవసతులు సమకూరాలి. వారి కాయకష్టంతోబాటు, లభించిన ఆర్థిక వసతులతో తమకిచ్చిన భూములను సస్యశ్యామలంగా చేయడానికి, ఆర్థిక దుస్థితినుండి విముక్తులు కావడానికి యిదే మార్గము.

## శాంతి సూచనలు

(ప్రపంచములో అశాంతి వాతావరణము సన్నగిల్లడానికి యీనాడు ఇండియా కృషి అమోఘంగా ఉపకరిస్తుండటం మన దేశానికి కీర్తి (ప్రతిష్ఠలతోబాటు (ప్రతి భారతీయునిలోను ఆత్మ విశ్వాసాన్ని పురికొల్పి బాధ్యతా నిర్వహణలో ముందుకు నడుపుతున్నవి.

యుగోస్లావియా (ప్రెసిడెంటు మార్షల్ టిటోలాంటి (ప్రముఖులరాక, బాండుంగులో జరిగిన ఆసియా ఆఫ్రికాదేశాల మహాసభ, ఇండియా (ప్రధాని పండిత నెహ్రూ రష్యాలో పర్యటనకై వెళ్ళడం, అంతర్జాతీయ రంగంలో వివిధ దేశాల మధ్యగల స్పర్ధలు నశించి సమరసభావాల పెంపుకు వినియోగపడుతున్న సూచనలు కనిపిస్తుండుట సంతోషింప తగినది.

పండిత నెహ్రూ, కుమార్తె శ్రీమతి ఇందిరాగాంధీతో రష్యా యితర యిరోపాదేశాలలో పర్యటించు సందర్భమున భారత (ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలపట్ల, (ప్రపంచశాంతి ఉద్యమంపట్లగల ఆసక్తి వెల్లడియయి (ప్రాక్పశ్చిమ దేశాలమధ్య సద్భావ, సహకారాలు పెంపొందగలవని ఆశిద్దాం.

———

# శ్రీ మన్మథనామ సం॥ ర జ్యేష్ఠ, ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ జూన్ | 16 | గు | ఏ 35 34 అశ్వ 35-53 త్యా 3.45 అమృతయోగః |
| | 17 | శు | ద్వా 20 50 భ 32-8 [illegible] |
| | 18 | శ | త్ర 23 33 కృ 27.50 తిథిద్వయం |
| | 19 | ఆ | చతు 17.0 రో 23.18 |
| | 20 | సో | ● అమా 10 26 మృ 18.45 |
| | | | **ఆషాఢమాసము** |
| | 21 | మం | శుక్ల పా 4 8 [illegible] 53-55 ఆర్ద్ర 14 29 |
| | 22 | బు | త 52-50 పున 10.47 |
| | 23 | గు | చ 48-38 పుష్య 7-48 అమృతసిద్ధియోగః |
| | 24 | శు | పం 45.31 ఆశ్రే 5-49 |
| | 25 | శ | ష 43.37 మ 4 56 త్యా 4.7 |
| | 26 | ఆ | స 42-56 పూఫ 5.17 భానుసప్తమి |
| | 27 | సో | అ 43-29 ఉఫ 6.51 |
| | 28 | మం | న 45-10 హ 9.36 త్యా 4-16 |
| | 29 | బు | ద 47-51 చి 13.24 |
| | 30 | గు | ఏ 51 23 స్వా 18.7 సర్వేషాంశయనైకాదశి |
| 1955 సం॥ జూలై | 1 | శు | ద్వా 55.30 విశా 23.31 |
| | 2 | శ | త్ర 59-55 అనూ 29-29 |
| | 3 | ఆ | చతు 60-10 జ్యేష్ఠ 35 23 త్యా 4.24 |
| | 4 | సో | చతు 4-25 మూల 41.26 |
| | 5 | మం | ○ పౌ 8.4 పూషా 46.54 త్యా 4.22 వ్యాసపూజ |
| | 6 | బు | కృపా 12-20 ఉషా 51-51 |
| | 7 | గు | వి 15-19 శ్ర 55.57 |
| | 8 | శు | త 17.18 ధని 59-2 త్యా 4.13 |
| | 9 | శ | చ 18.11 శ 60 10 పంచమీతిథిః |
| | 10 | ఆ | పం 17 53 శ 0 39 |
| | 11 | సో | ష 16-22 పూభా 1.17 త్యా 3.58 |
| | 12 | మం | స 13-35 ఉభా 0-41 రేవ 58 30 |
| | 13 | బు | అ 9 43 అశ్వ 56-21 |
| | 14 | గు | న 4-51 ఏప్యం 54-30 భ 52.42 |
| | 15 | శు | ఏ 53 0 కృ 48-27 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.





పార్వతీ పరమేశ్వరులు



మహాబలిపురంలోని ఆలయశిఖరాలు



సాయం సమయపు వెండి అంచుల నీలి మేఘం

(కేసరి ఫొటోగ్రాఫ్‌లు సౌజన్యంతో)